Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్ రైతు

సంపుటి: 81 • సంచిక: 39 • 24-9-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# దొంగల జోలికివెళ్తే పదవీ గండం

## • చేష్టలుడిగి చూస్తుండిపోతున్న సిఎం రోశయ్య

ముఖ్యమంత్రి రోశయ్య పెద్ద సంకటంలో చిక్కుకొని సతమతమౌతున్నాడు. ఒకటొకటిగా బయటపడుతున్న అవినీతి కుంభకోణాలు, ప్రజాధనం దోపిడీ వ్యవహారాలలో ఏ వైఖరి అవలంభించాలో అర్థంకాక జుట్టు పీక్కొంటున్నాడు. వీటన్నిటితో వైఎస్ కుటుంబానికి లేదా అనుచరవర్గానికి ప్రత్యక్ష ప్రమేయం వుండడమే అందుకు కారణం.

వైఎస్.రాజశేఖర్‌రెడ్డి తన ఆరేళ్ల పరిపాలనలో రాష్ట్రాన్ని దొంగలకు అప్ప చెప్పాడన్నది నిజం. ఆయన అనుచరులు, కుటుంబసభ్యులు, మిత్రులైన వ్యాపారవేత్తలు, రాజకీయవాదులు ఒకరితో ఒకరు పోటీలుపడి రాష్ట్ర ఖజానాను నిలువు దోపిడీ చేశారు. మరణించిన నాయకుడి తప్పులను మాట్లాడడం సభ్యత కాదనే వాదనతో ఈ తప్పులన్నిటినీ కప్పి పెట్టడం జరిగే పనికాదు. వైఎస్.రాజశేఖరరెడ్డి ఒక వ్యక్తి కాదు. ఎనిమిది కోట్ల ప్రజలకు పాలకుడు. ఆ పాలనలో జరిగిన లోటు పాట్ల ప్రభావం ఆయన మరణంతో అంతరించిపోదు. కొన్ని తరాల పాటు అది మనలను వేధిస్తూనే వుంటుంది. వెంటాడుతూనే వుంటుంది. పైగా వైఎస్ మరణంతో ఆయన సృష్టించిన రాజకీయ వ్యవస్థ కనుమరుగు కాలేదు. ఆయన ఒక్కడు లేడనే కొరత తప్ప, అది సజీవంగానే వుంది. ప్రజల నెత్తిన తాండవమాడుతూనే వుంది. అందువల్ల ఆయన భౌతికంగా లేనప్పుడు ఆయన తప్పులను ఎత్తి చూపరాదనడం జరిగే పని కాదు. ఆ తప్పులు సమాజాన్ని వెంటాడినన్ని రోజులూ ఆయన ప్రస్తావన కూడా తప్పనిసరి.

పైపెచ్చు వైఎస్ కుటుంబ అవినీతి మీద ప్రతిపక్షాలు, పత్రికల కంటే స్వపక్షం నుంచే ఎక్కువ వివరాలు, విమర్శలు తలెత్తుతున్నాయి. వైఎస్.రాజకీయ జీవితం ఆరంభించిన నాటి నుంచి ఆయనకు ప్రియమిత్రుడిగా, అత్యంత సన్నిహితుడైన సహచరుడిగా పేరుపడిన డిఎల్.రవీంద్రరెడ్డి వంటివారు ఈ వరసలో ముందు నిలబడుతున్నారు. మొదటగా ఆయన పేల్చిన బాంబు – బయ్యారం ఇనుప ఖనిజం గనుల కేటాయింపు. లక్షా నలభై వేల ఎకరాలలో, వూర్లు, ఇళ్లు, రోడ్లు, ఆస్పత్రులు, బడులు, గుడులతో సహా సర్వం తన అల్లుడికి వరకట్నంగా ఇచ్చిపోయాడు రాజశేఖర్‌రెడ్డి. ఆ గనులను అట్లనే కొనసాగించి వుంటే, వైఎస్ అల్లుడు బ్రదర్ అనిల్‌కుమార్ బిల్‌గేట్స్‌ను మించిన సంపన్నుడిగా ప్రపంచం దృష్టిలో పడి వుండేవాడు. కొన్ని లక్షల కోట్ల రూపాయల విలువైన ఇనుప ఖనిజం వుంది అక్కడ. ఈ కుంభకోణం బయటపడగానే కేంద్ర ప్రభుత్వం తీవ్రంగా స్పందించింది. ఆ గనులకు ఇచ్చిన లైసెన్స్‌ను రద్దు చేసింది. కానీ రోశయ్య మాత్రం దీనిపై తుది ఉత్తర్వులు జారీ చేయడానికి వెనుకా ముందు ఆడుతున్నాడు. రోజులు, వారాలు కాలయాపన చేస్తున్నాడు.

హైదరాబాద్ నగరంలోకెల్లా ఖరీదైన ప్రదేశంగా పేరుపొందిన గచ్చిబౌలీ ప్రాంతంలో

కొరవ 14వ పేజీలో

## సోనియమ్మ చాలా బిజీ!

కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీతో కలిసి, రాష్ట్ర వ్యవహారాలు చర్చించడానికి ముఖ్యమంత్రి రోశయ్య గత నెల రోజులుగా చేస్తున్న ప్రయత్నాలు ఫలించడం లేదు. ఆయనకు అమ్మగారి అపాయింట్‌మెంట్ దొరకడం లేదు. గత నెలలోనే ఢిల్లీ వెళ్ళి, మంత్రివర్గ విస్తరణ, జగన్ గొడవలను ముచ్చటించి రావాలని ముఖ్యమంత్రి తలపోశారు. కానీ జ్వరం వల్ల వీలు కాలేదు. ఈ నెలలో ఇప్పటికి మూడుసార్లు సోనియా దర్శనం అభ్యర్థించారాయన. కానీ అది దుర్లభంగా మారుతున్నది. జాతీయ రాజకీయాలలో ఆమెకు క్షణం తీరికలేని స్థితి ఏర్పడడమే అందుకు కారణం. కాశ్మీర్ కల్లోలం, అయోధ్య వివాదంపై అలహాబాద్ హైకోర్టు తీర్పు, అమెరికన్ అధ్యక్షుడు బరాక్ ఒబామా పర్యటన, కామన్‌వెల్త్ ఆటల పోటీల ఏర్పాట్లలో వైఫల్యం, బీహార్ ఎన్నికలు వంటి సమస్యలు చాలానే సోనియాగాంధీని చుట్టుముట్టి వున్నాయి. వాటి మధ్యలో ఆంధ్రా వ్యవహారాలను చక్కదిద్దే వ్యవధి దొరకడం లేదు. అందువల్లనే ముఖ్యమంత్రి ఎన్నిసార్లు అడిగినా అపాయింట్‌మెంట్ ఇవ్వకుండా వాయిదా వేసుకొంటూ పోతున్నారు.

# రోశయ్య మీద చాడీలు

ముఖ్యమంత్రి రోశయ్యకు ఢిల్లీ పెద్దలకు మధ్య సత్సంబంధాలు దెబ్బతింటూ వస్తున్నాయి. వైఎస్ స్థానంలో ఆపద్ధర్మంగా గద్దె ఎక్కిన ఆయన పట్ల మొదట మొదట కేంద్ర నాయకులు చిదంబరం, ప్రణబ్‌ముఖర్జీ, వీరప్ప మొయిలీ, అహ్మద్‌పటేల్ వంటి వారంతా సానుభూతి చూపేవారు. చివరకు సోనియాగాంధీ కూడా పాపం రోశయ్య అనే ధోరణిలో వుండేది. కానీ ఆయనపై ఇప్పుడు వారిలో ఆ సానుకూలత కన్పించడం లేదు. ప్రతిదానికీ ఢిల్లీ వైపు చూడడం, ఏ సమస్య వచ్చినా తమ భుజాల మీద వేసి తాను పట్టీ పట్టనట్లు వుండడం ఎంత కాలమని విసుక్కొంటున్నారు వారు. వీరప్ప మొయిలీ అయితే దాదాపుగా రోశయ్యకు దూరం జరిగిపోయాడు. ముఖ్యమంత్రి కూడా ఆయనతో మనసు విప్పి మాట్లాడే పరిస్థితి లేదు. తాను ఏమి చెప్పినా దాన్ని జగన్‌కు అనుకూలంగా మలచడానికి మొయిలీ ప్రయత్నిస్తున్నాడన్న అనుమానం ముఖ్యమంత్రిలో వుంది.

ఈ పెరుగుతున్న దూరాన్ని రాష్ట్రానికి చెందిన కొందరు కాంగ్రెస్ నేతలు చక్కగా వాడుకొంటున్నారు. రోశయ్య మీద ఢిల్లీకి చాడీలు మోస్తున్నారు. రోశయ్య కొడుకు, అల్లుడు ప్రభుత్వ వ్యవహారాలలో జోక్యం చేసుకొంటున్నారని, ఎక్సైజ్, కమర్షియల్ ట్యాక్స్ వంటి విభాగాలలో బదలీలన్నీ ఈ కుటుంబ సభ్యుల ప్రమేయంతోనే జరుగుతున్నాయని కేంద్రమంత్రి జైపాల్‌రెడ్డి అధిష్టానానికి ఒక నివేదిక ఇచ్చాడట. వైఎస్ చేసిన తప్పులను సరిదిద్దలేకపోవడమే కాక, ఇప్పటికీ వైఎస్ అనుచరులు తెచ్చి తన ముందు పెడుతున్న ఫైళ్ల మీద సంతకాలు చేస్తున్నాడని కూడా జైపాల్‌రెడ్డి కేంద్రానికి ఫిర్యాదు చేసినట్లు తెలుస్తున్నది. జగన్ వర్గం ఎమ్పీలు కూడా ముఖ్యమంత్రి మీద చాడీలు మోసే పనిలో నిమగ్నమై వున్నారు.

## కార్టూన్ స్కేప్

ఎరువులు నాసిరకం కదా అని...
కేసులు కూడా నాసిరకం చేస్తున్నారా సార్!!

## అయోధ్య వివాదం పూర్వాపరాలపై వివరణాత్మక కథనం...

9వ పేజీలో

# సిగ్గు... సిగ్గు...

ఢిల్లీలో కామన్‌వెల్త్ గేమ్స్ నిర్వహణ అనుమానంలో పడిపోయింది. భారత ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా భావించి చేపట్టిన ఆటల పోటీలివి. అభివృద్ధి చెందుతున్న దేశం స్థాయి నుంచి అభివృద్ధి చెందిన దేశంగా ఎదిగామని ప్రపంచానికి చాటడానికి ఇదొక అవకాశంగా భావించి, ఈ పోటీల నిర్వహణ చేపట్టారు. ఆటల ప్రపంచంలో ఒలంపిక్స్ తర్వాత చెప్పుకోదగినవి కామన్‌వెల్త్ గేమ్స్ మాత్రమే. ఒలంపిక్స్‌లో కూడా ఆడని నెట్ బాల్స్ వంటి ఆటలకు ఇందులో పోటీలు వుంటాయి. 54 దేశాల నుంచి కొన్ని వేల మంది క్రీడాకారులు ఈ పోటీలలో పాలు పంచుకొంటారు. ఇవన్నీ గతంలో బ్రిటీష్ వలస పాలనలో మగ్గిన దేశాలు. ఈ జాబితాలో కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఇంగ్లండ్ వంటి సంపన్న దేశాలు కూడా వున్నాయి. ప్రపంచస్థాయి ర్యాంకింగ్ కల్గిన అథ్లెట్లు చాలా మంది హాజరు కావడం వల్ల కామన్‌వెల్త్ గేమ్స్‌కు క్రీడా ప్రపంచంలో ఎనలేని ప్రాధాన్యత ఏర్పడింది.

2010లో వీటిని ఢిల్లీలో నిర్వహించాలని పట్టుబట్టి అనుమతి తెచ్చింది కేంద్ర ప్రభుత్వం. ఎనిమిదేళ్ల క్రితమే నిర్ణయమైన కార్యక్రమం అది. ఎటువంటి ఏర్పాట్లు చేయాలో కూడా బాగా తెలుసు. అందుకు తగిన నిధుల కేటాయింపు కూడా జరిగింది. కానీ దురదృష్టవశాత్తు క్రీడా నిర్వహణ కమిటీ ఈ విషయంలో దారుణంగా విఫలమైంది. అసమర్థులు, అవినీతిపరులు, ఆషాఢభూతులు, దోపిడీ దొంగలు, జాతి గౌరవం అంటే ఏమిటో తెలియని దగుల్బాజీలు నిర్వహణ కమిటీని కమ్మివేశారు. వారి దృష్టి అంతా ఎంత తినాలన్న తమకంపై కేంద్రీకృతమైంది తప్ప పోటీలు బాగా జరిపి, దేశ ప్రతిష్టను పెంచాలన్న తపనపై లేదు. ఫలితం – ప్రస్తుత దుస్థితి. పోటీల నిర్వహణ ఖర్చు 1900 కోట్ల రూపాయలని అంచనా వేశారు మొదట. తీరా ఏర్పాట్లు తుది దశకు వచ్చే సరికి ఆ మొత్తం 30వేల కోట్ల రూపాయలకు ఎగబ్రాకింది. మంత్రులు, రాజకీయవాదులు, అధికారులు, క్రీడా సంఘాల అధినేతలు, కాంట్రాక్టర్లు ఎవరికి దక్కింది వారు బొక్కి పారేశారు. క్రీడాజ్యోతి వెలిగించే పవిత్రమైన కార్యక్రమం పేరిట కూడా వందలాది కోట్లు భోంచేశారు. క్రీడా మైదానాలు, స్టేడియంలు, ప్రాథమిక వసతుల కల్పనలో జరిగిన దోపిడీ ఇంతా అంతా కాదు. వేల కోట్లు పెట్టి కట్టిన స్టేడియంలు పోటీల ప్రారంభానికి ముందే కుప్పకూలి పోతున్నాయి.

క్రీడల మంత్రి ఎం.ఎస్.గిల్ ఒక దురహంకారి. ఆయనకు ఏదీ పట్టదు. పట్టణ అభివృద్ధి శాఖ మంత్రి జైపాల్ రెడ్డికి నీతి వాక్యాలు వల్లించడం తప్ప, బాధ్యతలు నిర్వహించడం తెలియదు. అసమర్థతకు మారు పేరు ఆయన. క్రీడా నిర్వహణ కమిటీ అధ్యక్షుడు సురేష్ కల్మాడి చవకబారు రాజకీయ బ్రోకర్. క్రీడల పేరిట పెత్తనం చేయడం మాత్రమే తెలుసాయనకు. ఒక్క ఢిల్లీ ముఖ్యమంత్రి షీలా దీక్షిత్ మాత్రమే ఈ మొత్తం వ్యవహారంలో దేశం ప్రతిష్ట దెబ్బతింటుందన్న ఆదుర్దాతో పని చేశారు. కానీ విదూషకుల గుంపు ముందు ఆమె సమర్థత నిర్వీర్యమైపోయింది. చివరి నిముషంలో పరువు కాపాడుకోవడానికి ప్రధాని మన్మోహన్‌సింగ్ స్వయంగా ఏర్పాట్లను పర్యవేక్షించే బాధ్యత చేపట్టాడు. కానీ అప్పటికే జరగవలసిన నష్టం జరిగిపోయింది. ఆటగాళ్లు నివసించే ఇళ్లలో లెట్రిన్లు శుభ్రం చేశారా లేదా చూసుకోవల్సిన దుర్గతి ఒక దేశ ప్రధానికి పట్టడం కంటే హేయమైన విషయం వేరొకటి వుండదు. కానీ ఇప్పుడు మన్మోహన్‌సింగ్ అదే పనిలో వున్నాడు.

జమీన్‌రైతు

రెండేళ్ల క్రితం చైనాలో ఒలంపిక్ పోటీలు జరిగాయి. వాటి నిర్వహణ తీరు చూసి యావత్ ప్రపంచం ఆశ్చర్యంతో నోరు వెళ్లబెట్టింది. కానీ మన దేశం కామన్‌వెల్త్ గేమ్స్ నిర్వహిస్తున్న తీరు చూసి అదే ప్రపంచం అసహ్యించుకొంటున్నది. భారతీయులంటే మరుగు దొడ్లను శుభ్రంగా వుంచుకోవడం కూడా తెలియని పాకీ వారని పాశ్చాత్య దేశాల వారు నవ్వుకొనే అవమానకర పరిస్థితి తెచ్చి పెట్టారు క్రీడా నిర్వాహకులు. భారతీయులందరూ అవినీతిపరులని, అసమర్థులని అంతర్జాతీయంగా గేలి చేసే హేయమైన దుస్థితి దాపురింపచేశారు. ఇంతకంటే సిగ్గుమాలిన తనం వేరొకటి వుండదు. ఈ పోటీలను ఇంత దారుణంగా దెబ్బ తీసిన అధికారులు, రాజకీయవాదులను పోటీలు ముగిసిన వెంటనే జైలులో పెట్టించడం ప్రధాని చేయవలసిన పని.

## జనవాణి

### ప్రభుత్వ విధానాలే కారణం

దేశంలో నిత్యావసర వస్తువుల ధరలు రోజురోజుకు పెరగడం తప్ప తరగడం లేదు. ప్రపంచీకరణ, అంతర్గతమైన ధరల వ్యవస్థను అంతర్జాతీయ విపణితో అనుసంధానం చేయడం, ఆర్థిక మండళ్ల పేరిట వ్యవసాయ భూమిని దేశంలోని కార్పొరేట్ దోపిడీదారులకు, విదేశీ బహుళజాతి కార్పొరేట్ సంస్థలకు కట్టబెట్టడం వంటి చర్యల ద్వారా ప్రభుత్వమే ఆహారానికి కృత్రిమ కొరతలకు అవకాశం ఇచ్చింది. వ్యవసాయ ఉత్పత్తుల పెంపుదలకై ప్రభుత్వం కొత్త పథకాలను ఆవిష్కరించడం ఆగిపోయి ఏళ్లు గడిచిపోయాయి. దీనివల్లే బియ్యం ధరలు గత రెండేళ్లలో నూట ఎనభై శాతం పెరిగాయి. ఈ సంవత్సరం కాలంగా కందిపప్పు ధర మూడు రెట్లు పెరిగి రెండు రెట్ల వద్ద స్థిరపడింది. ఇప్పుడేమో నూనెల ధరలు అంట కాగుతున్నాయి. ఈ ధరల పెరుగుదల గూర్చి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పట్టించుకోక పోవడం బాధాకరం.

పి.అరుణకుమారి — నెల్లూరు

### చైనా వస్తువులను బహిష్కరిద్దాం!

చైనా పాత తరహాలోనే మనదేశంపై యుద్ధానికి కాలు దువ్వుతుంది. మన శత్రు దేశమైన పాకిస్తాన్‌తో పొత్తు పెట్టుకుంది. కేంద్ర ప్రభుత్వ కార్యాలయంలోని కంప్యూటర్‌లోని మనదేశ భద్రతా విషయాలను మన అనుమతి లేకుండా మోసంచేసి ఇంటర్‌నెట్ ద్వారా తెలుసుకుంది. మన దేశం చుట్టూ వున్న పాకిస్తాన్, శ్రీలంక, నేపాల్, బంగ్లాదేశ్‌లతో రకరకాల పొత్తులు పెట్టుకొని 11వేల మంది సైనికులను గిల్గిట్ ప్రాంతంలో వుంచి మనతో గిల్లికజ్జాలు పెట్టుకోను ప్రయత్నిస్తుంది. మనదేశంలో చైనా ఫోన్స్, చైనా బొమ్మలు, ఎలక్ట్రానిక్ గూడ్స్ వేల కోట్లకు అమ్ముకొంటుంది. ఈ లాభాన్ని తమ దేశ సైనిక అవసరాలకు వినియోగిస్తుంది. కాబట్టి భారతీయులు సాధ్యమైనంత వరకు స్వదేశీ వస్తువులను ఉపయోగిస్తూ చైనా తయారుచేసిన వస్తువులను బహిష్కరించి ఆ దేశానికి తగిన బుద్ధి చెప్పాలి.

ఎం.భరత్ — నెల్లూరు

### నమ్మక ద్రోహులు – ఆనం సోదరులు!

స్వర్గీయ వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి పెట్టిన రాజకీయ భిక్షతో ఎమ్మెల్యే, మంత్రి పదవులు పొందిన ఆనం సోదరులు ప్రస్తుతం వైఎస్ కుటుంబం పట్ల అనుసరిస్తున్న తీరు గర్హనీయం. జగన్ చేపడుతున్న ఓదార్పు యాత్రలో పాల్గొనమని

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

27-9-1940
పేజీలు : 16 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

28 తేది బ్రహ్మాండంగా నెల్లూరు జిల్లా రాజకీయ మహాసభ జరుగుతుంది. 27తేది రాత్రి మెయిలులో కలకత్తా నుంచి, ఒరిస్సా నుండి బడాబడా నాయకులు దిగుతున్నారు. 27 తేది సాయంత్రం వరకు గూడా జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు కందుకూరు నుంచి స్టార్టు అయినట్లు వర్తమానమేమీ రావడం లేదు. నాయకుల స్థితి యిలా వుంటే, ఇక సామాన్య ప్రజల్లో రాజకీయ ప్రబోధం ఎలా వుంటుందో గమనించండి. ఇవి మనలో మాటలు. ప్రభుత్వం వింటుందేమో?

* * *

వెంకటగిరి రాజా గారి హైస్కూలు కమిటీకి, రాజాగారికి దావా వ్యవహారంలో వుండిన రు.50,000లు వడ్డీతో సహా కో–ఆపరేటివ్ బ్యాంకు నుండి కమిటీ వారే తీసుకునేట్టు రాజీ జరిగినందుకు సంతోషం. మొదటనే యిది జరిగి వుంటే ఎస్టేటుకు డబ్బే కాదు ప్రెస్టేజి కూడా ఎంత లాభమండి?

### నెల్లూరు ఆనరరీ స్పెషల్ మేజిస్ట్రేటు

వీరు ముద్దాయిల పట్ల జూపుచున్న మానవ ప్రేమ: విస్సా రాజగోపాలరావు గారు స్పెషల్ ఫస్టుక్లాసు ఆనరరీ మేజిస్ట్రేటుగా చేయుచున్న సేవ ప్రశంసార్హం.

కేసులు విచారించుటలో కాలహరణ మొనర్పక, నిస్పాక్షికంగా, న్యాయ పరిశీలనా బుద్ధితో పార్టీలకు అసౌకర్యం కలిగించక ముద్దాయిలకు సైతం సీటిచ్చి తగు ఆదరాభిమానము జూపుచున్నందుకు ధన్యవాదాలు. ఇతర మేజిస్ట్రేటులు గూడా వీరి పంథా ననుకరించిన బాగుండును.

–ఇస్కా చెంచయ్య

## 50 ఏళ్ల క్రితం ఈవారం

23-9-1960
పేజీలు: 12 వెల: 0–20 న.పై

### బకింగ్‌హామ్ కాల్వ త్రవ్వకానికి 5లక్షలు

బకింగ్ హామ్ కాల్వను త్రవ్వి నౌకాయానానికి అనుకూలం జేయడానికి అవసరమైన యంత్ర సామగ్రిని కొనుటకు ఆంధ్రప్రదేశ్, మద్రాసు రాష్ట్రాలకు రు.5లక్షలను కేంద్రప్రభుత్వం మంజూరు చేసింది. ఇదిగాక ఈ సంవత్సరం మరొక రెండున్నర లక్షలు ఇవ్వాలన్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అభ్యర్థనను కేంద్ర ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

### నెల్లూరు భూగర్భ మురుగు నీటి పథకం తరలింపు

రాజకీయ కారణాలేవైనప్పటికీ, మంజూరై పని జరుగుతున్న నెల్లూరు పట్టణ భూగర్భ మురుగునీటి పథకమును రద్దు జేసి, వేరొక ప్రాంతానికి తరలించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జేస్తున్న ప్రయత్నాల పట్ల ఈనెల 18తేది నెల్లూరులో సమావేశమైన నెల్లూరు పట్టణ స్వతంత్ర పార్టీ కార్యకర్తలు, అభిమానుల సమావేశం విచారమూ, ఆందోళన వ్యక్తపరచింది. మంజూరైన డ్రెయినేజి స్కీమును కొనసాగించి పూర్తి జేయవలసినదిగా నెల్లూరు పట్టణ రెంట్ పేయర్ల పక్షంగా ప్రభుత్వాన్ని కోరింది.

### వర్షం కురిసినా తప్పని దుర్భిక్షం

గడచిన వారం రోజులుగా నెల్లూరు జిల్లాలో కురిసిన వర్షాలకు, మంచినీటి ఎద్దడి తీరిందేగాని, జిల్లాలో ఇంకా దుర్భిక్ష పరిస్థితి తొలగిపోలేదని, సాగుబడికి కావలసినంతగా చెరువులలో నీరు నిల్వ లేదని, వేసిన సజ్జపైరు నల్లకంకి పట్టిపోయిందనీ, మెట్ట పైర్లన్నీ గూడా పనికిరాకుండా పోయినవనీ, క్రొత్తగా పైర్లు పెట్టినప్పటికీ పంట చేతికి వచ్చేటప్పటికి అయిదారు నెలలు పడుతుంది. అందువల్ల అనుకున్న ప్రకారం క్షామ నివారణ కార్యక్రమం ప్రభుత్వం చేపట్టాలని 21తేది నెల్లూరులో జరిగిన అధికార, అనధికారుల సమావేశంలో నెల్లూరు మండల శాసనసభ్యులు, వివిధ పంచాయితీ సమితుల అధ్యక్షులు ప్రభుత్వాన్ని కోరారు.

# నెల్లూరు ముచ్చట్లు

## ప్రత్యేక అధికారుల పాలన

జిల్లాలోని కార్పొరేషన్, మునిసిపాలిటీల పాలకవర్గం పదవీకాలం 29వ తేదీతో పూర్తవుతుండడంతో తదుపరి పాలన సాగించేందుకు ప్రత్యేక అధికారులను నియమించనున్నారు. నెల్లూరు కార్పొరేషన్‌కు జాయింట్ కలెక్టర్ సౌరభ్ గౌర్‌ను ప్రత్యేక అధికారిగా నియమించవచ్చు. గూడూరు మునిసిపాలిటీకి నెల్లూరు ఆర్డీఓ వేణుగోపాలరెడ్డి, కావలి మునిసిపాలిటీకి కావలి ఆర్డీఓ మద్దా వెంకటేశ్వర్లు, వెంకటగిరి మునిసిపాలిటీకి గూడూరు ఆర్డీఓ రామ్మూర్తిని ప్రత్యేక అధికారులుగా నియమించను రంగం సిద్ధమయ్యింది.



## అక్కడ వైఎస్ విగ్రహం అందగించదేమో?

నెల్లూరు గాంధీబొమ్మ వద్ద ప్రతిష్టిస్తున్న వైఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహానికి ఇది సరైన చోటు కాదని ఆయన అభిమానులు అభిప్రాయపడుతున్నారు. రాజీవ్‌భవన్ నిర్వాహకులు గతంలో శంకుస్థాపన చేసిన ప్రదేశమే అన్ని విధాల బాగుంటుంది. కార్పొరేషన్ పాలకులు మరీ ముఖ్యంగా రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఆర్‌అండ్‌బి అధికారుల చేత ఒత్తిడి చేయించి స్థలాన్ని మార్పించజేశారు. వైఎస్ జగన్ చేత ఆవిష్కరింపజేయ తలపెట్టిన ఈ విగ్రహానికి ఇప్పటికే ఈ ప్రాంతంలో వున్న జాతిపిత గాంధీజీ విగ్రహానికి పెద్ద దూరం లేకుండా పోవడం వల్ల వైఎస్ విగ్రహం అంత అందగించకపోవచ్చనేది అభిమానుల హృదయ వేదన. కానీ వైఎస్ వల్ల లబ్ధిపొందిన నేతలకు ఆ హృదయం లేకుండా పోయిందే...

## సాగునీటి సలహా బోర్డు సమావేశం

జిల్లా రైతులు ఎప్పుడు జరుగుతుందా అని ఎదురుచూస్తున్న జిల్లా సాగునీటి సలహా బోర్డు సమావేశం ఈ నెల 30వ తేదీ నెల్లూరు కలక్టరేట్ ప్రాంగణంలోని గోల్డెన్ జూబ్లీ హాల్‌లో జరుగుతుంది. ఖరీఫ్ సాగుకు సంబంధించి సోమశిల, కండలేరు నుంచి జలాల విడుదలతోపాటు సంగం, నెల్లూరుల వద్ద నిర్మిస్తున్న ఆనకట్టల వ్యవహారాన్ని చర్చించను అజెండా సిద్ధం చేశారు. మునిసిపల్ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఎమ్మెల్యేలు, సాగునీటి విభాగం అధికారులు ఈ సమావేశంలో పాల్గొంటారు.



## కండువా దానం చేసిన మేయర్

తనకు కార్పొరేటర్ శిరిగిరి చక్రవర్తి మెడలో వేసిన పార్టీ కండువాను ఓ బిచ్చగత్తెకు నెల్లూరు మేయర్ భానుశ్రీ దానంచేసి తనలోని విచిత్ర దయార్ద్ర హృదయాన్ని చాటారు. 20వ తేదీ కాసుఖేలవారి అగ్రహారంలో జరిగిన రోడ్డు శంకుస్థాపనకు నెల్లూరు రూరల్, సిటీ ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, శ్రీధర్ కృష్ణారెడ్డిలతో కలసి మేయర్ విచ్చేశారు. శిరిగిరి చక్రవర్తి వివేకానందరెడ్డి, మేయర్ భానుశ్రీలకు పార్టీ కండువాలు, శ్రీధర్‌కృష్ణారెడ్డికి బొకే అందించి స్వాగతం పలికారు. ఈ సమయంలో మనుషులు లేకపోవడంతో సిగరెట్ తాగుతూ వివేకా సెంటర్‌లో కబుర్లలో దిగగా, ఓ బిచ్చగత్తె మేయర్‌ను దానం చేయమని ఒత్తిడి చేసింది. దీంతో ఆమెను తట్టుకోలేక మేయర్ ఆ బిచ్చగత్తెకు తన మెడలోని కండువావేసి నమస్కారం పెట్టడం చూసేవారికి విచిత్రంగా తోచింది.

## చీకటిపడ్డాక శంకుస్థాపనలు!

29వ తేదితో కార్పొరేషన్ పాలకవర్గం పదవీకాలం ముగుస్తుండడంతో నగరంలో వివిధ అభివృద్ధి పనుల శంకుస్థాపనలకు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, మేయర్ భానుశ్రీ, సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డిలకు సమయం చాలడం లేదు. పగలే కాదు రాత్రిపూట శంకుస్థాపనలకు సాహసిస్తున్నారు. నియాన్ లైట్ల వెలుగుల్లో వాళ్లు చేస్తున్న శంకుస్థాపనలకు జనం నుంచి పెద్ద స్పందన లేకపోవడం విశేషంగా చెప్పుకోవాలి.

## డిసెంబరుకు జడ్పీ ఆఫీసు పూర్తి!

నెల్లూరు పొదలకూరురోడ్డులోని క్షయాసుపత్రి ప్రాంగణంలో నిర్మిస్తున్న నూతన జిల్లా పరిషత్ కార్యాలయాన్ని డిశంబరు నెలకు పూర్తిచేస్తామని ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి చెప్పారు. ఐదు కోట్ల రూపాయలు వెచ్చించి నిర్మిస్తున్న ఈ కార్యాలయం కోసం ప్రభుత్వం రెండు కోట్లు, అక్రమ ఇసుకరీచ్‌ల ద్వారా జడ్పీకి ఒనకూడిన మూడు కోట్ల రూపాయల నిధులు వెచ్చిస్తున్నట్లు ఛైర్మన్ వివరించారు.

ఈ కార్యాలయాన్ని సైతం ఛైర్మన్ త్వరితగతిన పూర్తిచేయాలని నిశ్చయించడంతో రాత్రిపూట కూడా పనులు జరుగుతున్నాయి.

## భార్యను చంపిన భర్త

అనుమానం పెనుభూతంగా మారిన భర్త భార్యను అంతమొందించిన సంఘటన 18వ తేదీ నెల్లూరు జాకీర్ హుస్సేన్‌నగర్‌లో జరిగింది. లేగుంట పాడుకు చెందిన బద్వేల్ మాధవరెడ్డి, ఇనమడుగుకు చెందిన జ్యోతిని ఎనిమిదేళ్ల క్రితం ప్రేమించి పెళ్లి చేసుకొన్నాడు. వీరికి ఆరేళ్ల యశ్వంత్ అనే అబ్బాయి కూడా వున్నాడు. నాగార్జున కన్‌స్ట్రక్షన్స్‌లో పనిచేసే మాధవరెడ్డికి గత కొన్నేళ్లుగా భార్య ప్రవర్తన మీద అనుమానం పెనుభూతంలా మారింది. 18వ తేదీ సాయంత్రం షాపింగ్‌కు వెళ్లి వచ్చిన ఆమెతో వాగ్వివాదానికి దిగాడు. ప్రక్కనే వున్న కత్తితో జ్యోతి గుండెలపై పొడిచి పరారయ్యాడు.

## బిసిల్లో ఐక్యత లేదు!

దేశంలో 65కోట్ల మందిపైగా వున్న బిసిలు ఐకమత్యంగా వుంటే రాజ్యాధికారం పెద్ద కష్టం కాదని బిసి సంక్షేమ సంఘం రాష్ట్ర అధ్యక్షుడు ఆర్.కృష్ణయ్య అభిప్రాయపడ్డారు. 20వ తేదీ నెల్లూరు టౌన్‌హాల్‌లో జరిగిన బిసి విద్యార్థుల మహాసభకు ముఖ్యఅతిథిగా విచ్చేసి మాట్లాడారు. దివంగత ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి బిసిల అభిమాని అయితే ప్రస్తుత ముఖ్యమంత్రి రోశయ్య దురభిమానన్నారు. 1800 కోట్ల రూపాయల బిసి విద్యార్థుల ఫీజుల రీఎంబర్స్‌మెంట్ తన దీక్షతో సాధ్యమైనట్లు చెప్పుకొన్నారు. సభలో కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు, గూడూరు మునిసిపల్ ఛైర్‌పర్సన్ యారం మంజుల తదితరులు పాల్గొన్నారు.

## వాడా రాజగోపాలరెడ్డికి మాతృ వియోగం

ముత్తుకూరు వాసి, హైకోర్టు న్యాయమూర్తిగా ఢిల్లీలో క్యాట్ వైస్‌ఛైర్మన్‌గా పనిచేసి నెల్లూరు పేరు ప్రతిష్టలు

కొరవ 14వ పేజీలో

# పేకాటకు బాస్ గ్రీన్‌సిగ్నల్?

**• తెరుచుకున్న రెండు క్లబ్బులు.**

నెల్లూరు నగరంలోని రెండు రిక్రియేషన్ క్లబ్బులకు వందల యేళ్ల చరిత్ర వుంది. ఒకప్పుడు ఘనంగా నడిచిన ఈ క్లబ్బుల్లో పేకాట ఆడను పాత ఎస్పీ కె.శ్రీనివాసరెడ్డి ఒప్పుకోకపోవడంతో అప్పటి నుంచి ఈ క్లబ్బుల వైభోగం క్రమంగా తగ్గింది. శ్రీనివాసరెడ్డి తర్వాత వచ్చిన ఎస్పీలు రాజేంద్రనాధ్‌రెడ్డి, సూర్య నారాయణ, చివరికి మల్లారెడ్డి కూడా క్లబ్బుల్లో పేకాటకు అనుమతించ లేదు. దీంతో పేకాటరాయుళ్లు గుట్టుచప్పుడు కాకుండా రహస్య స్థావరాల్లో పేకాట ఆడుకొంటున్నారు. ఇదిలా వుండగా 125 ఏళ్ల సంవత్సరాల చరిత్ర వున్న నెల్లూరు క్లబ్‌ను ఆగష్టు 15వ తేది నుంచి మళ్లీ పునరుద్ధరించారు. గౌరవ సభ్యులకే ప్రవేశమంటూ పేకాట ఆడుతున్నారట.

ఇంతే చరిత్ర వున్న నెల్లూరు మెక్లిన్స్ క్లబ్ పునరుద్ధరణకు పోలీసు బాస్ 18వ తేది ఒప్పుకున్నట్లు విశ్వసనీయవర్గాల ద్వారా తెలిసింది. క్లబ్బులంటే ముందు పేకాట ఆతర్వాతే మిగతా కార్యక్రమాల నిర్వహణనేది జగద్విదితం. ఏళ్లతరబడి పేకాట జరక్కుండా మూసున్న క్లబ్బులను తీత పేర పేకాట జరగకుండా చూడాలని మహిళలు కోరుకొంటున్నారు. ఈ విషయాన్ని పట్టించుకోకుండా పేకాట క్లబ్బులకు తలుపులు బార్లాతెరిస్తే పలు మహిళా ఉద్యమాలకు ఊపిరిపోసిన నెల్లూరు మహిళలు ఉద్యమ పధాన నడవక తప్పదు. ఈ విషయాన్ని పోలీసు బాసు గుర్తెరిగితే మంచిది.

# ప్రచారార్భాటం ఘనం – ఖజానా మాత్రం ఒట్టిపోతుంది!




*ఎంత ఫీజు చెల్లించారని జాతిపిత విగ్రహానికి అడ్డంగా ఫ్లెక్స్ ఏర్పాటుకు అంగీకరించారో?*

**• కార్పొరేషన్‌లో మరో కుంభకోణం**

నెల్లూరు కార్పొరేషన్‌లో జరుగుతున్న కుంభకోణాలను నేతాను కూడా పసిగట్టలేక పోతున్నానని ఈ నెలాఖరుకు మేయర్ పదవి నుంచి దిగిపోయే భానుశ్రీ కూడా చెప్పిందంటే ఇక్కడ ఏ మేర అవినీతి అక్రమాలు జరుగుతున్నాయో అర్థం చేసుకోవచ్చు. ఈ మధ్య నెల్లూరులో ఎక్కడచూసినా, వివిధ రకాల ప్రచారం చేసుకొనే ఫ్లెక్స్‌బోర్డులు, పర్మినెంట్ బోర్డులు కనపడుతున్నాయి. ఈవిధంగా ప్రచారం చేసుకోవాలంటే ముందుగా ఫలానా సెంటర్‌లో బోర్డు పెట్టాలనుకొంటున్నామని కార్పొరేషన్ కార్యాలయంలో లిఖిత పూర్వకంగా అనుమతి తీసుకోవాలి. దీనికిగాను కార్యాలయంలోని ప్రచార విభాగం పర్యవేక్షకుడు సూచించే ఫీజు చెల్లించాలి. కానీ నగరంలో బోర్డులు పెట్టేవారెవరూ కార్పొరేషన్ అనుమతి కోరడం లేదు. ఫ్లెక్స్ బోర్డుల తయారీ ఏజెన్సీలే వీటిని తయారుచేయించిన వ్యక్తుల నుంచి కార్పొరేషన్‌కు చెల్లించాల్సి మొత్తం అంటూ కొంత తీసుకొంటున్నారు. వీరు కార్పొరేషన్ వారికి ఐదువేలు చెల్లిస్తే వెయ్యి రూపాయలకు రశీదు ఇస్తున్నారు. నగరంలో సరిగ్గా అడ్వర్టైజింగ్ ఛార్జీలు వసూలు చేస్తే సంవత్సరానికి 50 నుంచి 60 లక్షల రూపాయల వరకు తగ్గకుండా ఆదాయం వస్తుంది. ప్రస్తుతం పది లక్షల రూపాయలే వస్తుందని కార్పొరేషన్ అధికారులు లెక్క చూపుతున్నారంటే ఎన్ని లక్షల రూపాయలు వీరు స్వాహా చేస్తున్నారో అర్థం చేసుకోవచ్చు. అధికార పార్టీకి చెందిన ఓ వర్గం నేతలు పెట్టే ఫ్లెక్స్ బోర్డులకు పైసా పన్ను చెల్లించకపోయినా అడిగేవారే లేరు. ప్రకటనల తాలుకు పన్ను స్వాహా విషయం కమిషనర్‌కు తెలిసినా ఆయన తెలియనట్లే వున్నారని కార్పొరేషన్ పరిసరాలు కోడైకూస్తున్నాయి.

*అఖిలపక్ష సమావేశంలో మాట్లాడుతున్న చంద్రమోహన్‌రెడ్డి. ప్రక్కన సిపిఎం భానురాజు, బిజెపి ఆంజనేయరెడ్డి.*

# ధర్మల్ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా పోరాటం

జిల్లాలో ఏర్పాటవుతున్న ధర్మల్ విద్యుత్ కేంద్రాలకు వ్యతిరేకంగా పలు పార్టీలు గళం విప్పాయి. రైతుల నోళ్లుకొట్టి భూములను లాక్కొని ఏర్పాటుచేస్తున్న ఈ ప్రాజెక్టుల వల్ల లాభం కంటే నష్టమధికమని, పలువురు నేతలు అభిప్రాయపడ్డారు. జడ్పీ హాలులో జరిగిన చర్చావేదికలో టిడిపి, బిజెపి, పిఆర్‌పి, సిపిఎం, సిపిఐ, లోక్‌సత్తా, జనవిజ్ఞాన వేదికకు చెందిన పలువురు నేతలు తమ వాణిని విన్పించారు. ప్రజారాజ్యం పార్టీ ఎమ్మెల్యే శ్రీధర్ కృష్ణారెడ్డి మాట్లాడుతూ బడా కంపెనీలకు విచ్చలవిడిగా పేదల భూములను ధారాదత్తం చేస్తూ ప్రజల ఆరోగ్యాన్ని దెబ్బతీస్తున్నదని విమర్శించారు. తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మాట్లాడుతూ ఈ ప్రాజెక్టుల కారణంగా తీరప్రాంత మండలాలైన టిపిగూడూరు, ముత్తుకూరులతోపాటు చిల్లకూరు కాలుష్యం కోరల్లో చిక్కుకొనిపోతున్నాయని ఆందోళన చెందారు. ప్రజారోగ్యాన్ని, పర్యావరణాన్ని దెబ్బతీసే ప్రాజెక్టుల మంజూరులో ఆంతర్యమేమిటో ప్రభుత్వం తెలియజేయాలని బిజెపి జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి డిమాండ్ చేశారు. ప్రజల ఆరోగ్యాన్ని దృష్టిలో వుంచుకొని వీటిని వ్యతిరేకిస్తున్నట్లు సిపిఎం కార్యదర్శి భానురాజు స్పష్టం చేశారు. ధర్మల్ ప్రాజెక్టుల ఏర్పాటుతో ప్రజలకు జరగే హానిని నివారించేందుకుగాను అవసరమైతే కాంగ్రెస్ పార్టీని కల్పుకొని ప్రాజెక్టులనడ్డుకొంటామని అఖిలపక్షం స్పష్టం చేసింది. ఈ కార్యక్రమంలో సిపిఐ నాయకులు రామరాజు, జనవిజ్ఞానవేదిక రాష్ట్ర నాయకుడు డాక్టర్ రమణయ్య, రైతు కూలీ సంఘానికి కిషోర్‌బాబు, లోక్‌సత్తా పార్టీ నేత చక్రవర్తి తదితరులు పాల్గొన్నారు.

# పల్లె పల్లెకు తెలుగుదేశం



*టిడిపి సర్వసభ్య సమావేశంలో మాట్లాడుతున్న పరిశీలకుడు దొరబాబు.*

మునిసిపల్ ఎన్నికలకు సమాయత్తం అయ్యేందుకు, శ్రేణులకు కర్తవ్య బోధనచేసి వారిలో సమరోత్సాహం నింపేందుకు తెలుగుదేశం పార్టీ నడుం బిగించింది. సెప్టెంబర్ 8వ తేది జిల్లా పార్టీ కార్యాలయంలో జరిగిన సర్వసభ్య సమావేశంలో కార్యకర్తలకు దిశానిర్దేశం చేసేందుకు, వారిలో ఉత్సాహాన్ని నింపే దిశగా వుండడం విశేషం. జిల్లా పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డితోపాటు రాష్ట్ర పరిశీలకులు వర్ల రామయ్య, మాజీ మంత్రి ఫరూక్, దొరబాబులు హాజరై పార్టీ చేపట్టబోయే కార్యక్రమాలను వివరించారు. రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగా నిస్తేజమయ్యిందని, రోశయ్య పాలనలో ప్రజల బాగోగులు పట్టించుకొనే వారే లేకుండా పోయారని విమర్శించారు. కాంగ్రెస్ పార్టీలో అవినీతి పెచ్చుమీరిందని, రోజురోజుకు ఎన్నో అవినీతి అక్రమాలు వెలుగుచూస్తూనే వున్నాయని, వైఎస్ రాజశేఖర్‌రెడ్డి, జగన్‌ల కోట్ల రూపాయల అవినీతి బట్టబయలౌతున్నదని ప్రజాసంక్షేమం, రైతు సంక్షేమం పట్టని ప్రభుత్వానికి, అవినీతికి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ఉద్యమించాలని పిలుపునిచ్చారు. అక్టోబర్ 3 నుంచి 30వ తేది వరకు పల్లెపల్లెకు తెలుగుదేశం కార్యక్రమాన్ని ప్రతిఒక్కరూ విజయవంతం చేయాలని కోరారు. రోడ్లు పూర్తిగా ధ్వంసం అయ్యాయని, మద్యం ఏరులై పారుతున్నదని వీటన్నింటినీ ప్రజలకు తెలియజేసి, వారిని చైతన్య పరచి పార్టీని వారికి దగ్గర చేయాలని తీర్మానించారు.

ఈ సమావేశంలో ఎమ్మెల్యేలు బీద మస్తాన్‌రావు, బల్లి దుర్గాప్రసాద్, కురుగొండ్ల రామకృష్ణ, పరసారత్నం, మాజీ మంత్రి రమేష్‌రెడ్డి, పార్టీ మహిళా విభాగం అధ్యక్షురాలు అంచల వాణి తదితరులు పాల్గొన్నారు.

# దడపుట్టిస్తున్న జాయింట్ కలెక్టర్

జిల్లా జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ జిల్లాలోని అన్ని మండల తహశీల్దార్ కార్యాలయాలను ఆకస్మిక తనిఖీ చేస్తున్నారు. ఈయన పర్యటనలో భూ వివాదాలకు సంబంధించిన విషయాలపై ప్రజల నుంచి వినతి పత్రాలను స్వీకరిస్తున్నారు. మండలాల పరిధిలో ఆక్రమణకు గురైన భూములు, ఖాళీస్థలాల వివరాలను గురించి అధికారులనడిగి తెలుసుకుంటున్నారు. అంతేకాకుండా గ్రామీణ ప్రాంతాల్లో వున్న చౌకదుకాణాలలో ప్రభుత్వం పంపిణీ చేస్తున్న సరుకులు సక్రమంగా అందుతున్నాయా లేదా అని ఆరా తీస్తున్నారు. జాయింట్ కలెక్టర్ ఆకస్మికంగా మండల తహశీల్దార్ కార్యాలయాల తనిఖీకి వస్తుండడంతో అన్ని తహశీల్దార్ కార్యాలయాల్లోని ఉద్యోగులు దడదడలాడుతున్నారు.

• రవాణా శాఖలో

# రహస్య విచారణ!

## దొంగలు దొరికేనా?

రవాణాశాఖలో వివిధ పనులకు నిర్ణీత ధర కంటే అధిక మొత్తంలో డబ్బులు వసూలు చేస్తున్నారన్న ఆరోపణలపై ఎసిబి రహస్య విచారణ ప్రారంభించింది. అధికంగా నగదు వసూలు చేస్తున్నారని వచ్చిన ఆరోపణలపై 2006 సంవత్సరంలో ఎసిబి అధికారులు దాడులు నిర్వహించి 15 మంది ఉద్యోగులపై కేసులు నమోదు చేశారు. రికార్డుల నిర్వహణ సక్రమంగా లేకపోవడంతో కేసులు పెట్టారు. దీనిపై ఉన్నతాధికారులకు నివేదిక పంపారు. దీనిపై ప్రభుత్వం శ్రీనివాసరావును విచారణాధికారిగా నియమించింది. నాలుగేళ్ల అనంతరం ఎసిబి అధికారులు రవాణాశాఖ ఉద్యోగులపై విచారణ చేపట్టడంతో కార్యాలయంలోని ఉద్యోగుల్లో గుబులు పుట్టింది. ఫిర్యాదులందిన ఉద్యోగులను కోర్టు, ట్రిబ్యునల్, కమిషనర్ ఆఫ్ ఎంక్వయిరీ, డిపార్ట్‌మెంటల్ ఎంక్వయిరీ అనే నాలుగు విభాగాలుగా విచారణ చేస్తున్నట్లు సమాచారం. ఎసిబి అధికారి శరత్‌బాబు ఆధ్వర్యంలో కేసు నమోదు చేసిన మోటార్ వెహికల్ ఇన్స్‌పెక్టర్ ఆదినారాయణ, సత్యనారాయణ, ప్రసాద్, కృష్ణారావు, సిబ్బంది ప్రభాకర్, రామయ్య, మాధవరావు, పద్మావతి, విజయ తదితరులను రెండు దఫాలుగా విచారించి వారి వివరణను తీసుకొన్నారు అధికారులు. ఆలస్యమైనా చేపట్టిన ఈ విచారణతోనైనా రవాణాశాఖలో మార్పొస్తుందేమో చూడాలి.

# విలువలకు ఊడిన విలువలు

**జిల్లాలో మహిళలు, యువతులు, మైనర్ బాలికలపై హత్యలు, అత్యాచారాలు, లైంగిక వేధింపులు నిత్యకృత్యమయ్యాయి. ఇవి చాలవన్నట్లు ఏదో ఒక బలహీన క్షణంలో ఏర్పడే అక్రమ సంబంధాల వంటి తప్పులు పదే పదే పునరావృతమవడం వల్ల జీవితాలు చేజేతులా నాశనమవడమేగాక, సభ్యసమాజంలో తలదించుక నిలవాల్సి వస్తోంది.**


తల్లి కర్కశత్వం వల్ల కష్టాల పాలైన నర్తన.

సమాజంలో రోజురోజుకు మానవతా విలువలు మంటకలుస్తున్నాయి. శాస్త్ర, సాంకేతిక రంగాల్లో ఎంతో అభివృద్ధి సాధిస్తూ ముందుకెళ్తున్నప్పటికి క్షణికావేశాలకు లోనై అక్రమ మార్గంలో పయనిస్తున్నారు. చట్ట వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడేందుకు వెనుకాడడం లేదు. ఫలితంగా అనేక మంది తమ జీవితాలను చేతులారా నాశనం చేసుకుంటున్నారు. సభ్య సమాజం తలదించుకునే చర్యలకు పూనుకొని సమాజం చేత చీదరించబడుతున్నారు. విలాసవంతమైన జీవితం గడిపేందుకు ఎంతటి ఘాతుకానికైనా దిగజారుతున్నారు. చట్టం, న్యాయం ఇటువంటి వారి పట్ల కఠినంగా వ్యవహరించలేకపోతున్నది.

## విఫలమైన చట్టం

హత్యలు, దోపిడీలు, అత్యాచారాలు, అక్రమసంబంధాల కారణంగా పుట్టిన పసికందుల్ని చెత్తకుప్పల్లో వేయడం, మద్యం మత్తులో మహిళల పట్ల అఘాయిత్యాలు, అత్యాచారాలకు పాల్ప


నెల్లూరు జాకీర్‌హుస్సేన్ నగర్‌లో భర్త కిరాతకానికి బలైన జ్యోతి.

డుతున్న అనేక సంఘటనలు నిత్యం అందరం చూస్తూనే వుంటాం. ప్రధానంగా మహిళలపై జరిగే అఘాయిత్యాలను నియంత్రించడంలో చట్టం పూర్తిగా వైఫల్యం చెందుతున్నది. నేరాలకు పాల్పడేవారిని అణిచివేసేందుకు రూపొందించబడిన ఐపిసి సెక్షన్లు సక్రమంగా అమలు జరగడం లేదు. దీంతో చట్టంలోని లొసుగుల్ని ఆసరా చేసుకొని నేరం నుంచి బయటపడగలుగుతున్నారు.

## వ్యభిచార ఊబిలో దింపుతున్నారు!

అభం శుభం తెలియని బాలికల్ని, ఆర్థిక ఇబ్బందుల్లో వున్న యువతుల్ని టార్గెట్‌గా చేసుకొని వ్యభిచార వృత్తిలోకి దింపేవారు అనేక మంది వున్నారు. వీరంతా పెద్దపెద్ద భవంతులను, అపార్టుమెంట్లను అద్దెకు తీసుకొని గుట్టుచప్పుడు కాకుండా వ్యభిచార గృహాలను కొనసాగిస్తుంటారు. ఎప్పుడో పోలీసులు దాడులు చేసిన సమయంలో మాత్రమే ఇటువంటివి బయట పడుతుంటాయి. మిగిలిన సమయంలో వీటి గురించి సమాచారం వున్నప్పటికి దాడులు చేయరన్న విమర్శలు పోలీసులపై వున్నాయి. పొట్టకూటి కోసం వ్యభిచారం చేసే వారినే పోలీసులు తరచూ అరెస్టు చేస్తుంటారు. హైటెక్ వ్యభిచార గృహం నిర్వహించే వారి జోలికి వెళ్లరన్న ఆరోపణలున్నాయి.

## అఘాయిత్యాలు జరగని రోజు లేదు!

నెల్లూరు జిల్లాలో రోజుకో ప్రాంతంలో మహిళలపై అఘాయిత్యాలు, అత్యాచారాలు, వరకట్న వేధింపులు, లైంగిక వేధింపులు నిత్యం జరుగుతూనే వున్నాయి. వీటిలో కొన్ని పోలీసుస్టేషన్ల వరకు వస్తుండగా మరికొన్ని కేసులు ఆయా గ్రామాల్లోనే రాజీ పేరుతో మరుగున పడిపోతున్నాయి. అత్యాచారానికి గురికాబడిన మహిళలు ఫిర్యాదు చేసిన వెంటనే వైద్యపరీక్షలకు పంపాల్సి వుండగా పోలీసులు కావాలనే వుద్దేశంతోనే కాలయాపన చేయడంతో అత్యాచారం జరిగిన విషయం నిర్ధారణ కాక నేరస్తులు శిక్ష నుంచి తప్పించుకునేందుకు పరోక్షంగా పోలీసులు సహకరిస్తుంటారు. చట్టాన్ని అమలు చేయాల్సిన పోలీసులే కేసుల్ని నీరుగార్చేందుకు ప్రయత్నించడం విశేషం.

మహిళలపై జరిగే నేరాలకు సంబంధించి పోలీసు రికార్డుల్లో నమోదైన కేసులలో కొన్నింటికి కూడా శిక్షలు పడకపోవడంతో మరిన్ని నేరాలు జరిగేందుకు అవకాశం కల్పించినట్లు భావించాల్సి వస్తోంది. వరకట్న వేధింపులు, ఈవ్‌టీజింగ్, అసభ్యప్రవర్తన, గృహహింస, లైంగిక వేధింపుల నియంత్రణ కోసం రూపొందించిన చట్టాలు కాగితాలకే పరిమితమై పోతున్నాయి. తమ హక్కులకు భంగం కలిగిందని భావించినప్పటికీ విద్యావంతులైన మహిళల్లో కొందరికి చట్టాలపై సరైన అవగాహన లేకపోవడం, మరికొందరు కుటుంబ పరువు బజారున పడుతుందని భయపడి నాలుగు గోడలకే పరిమితమై పోతున్నారు. గ్రామీణ ప్రాంతాలకు చెందిన మహిళలైతే తమపై జరిగిన అఘాయిత్యాలను అవమానకరంగా భావించి ఆత్మహత్యలకు పాల్పడి జీవితాన్ని చాలించుకుంటున్నారు.

## హక్కుల హరణ

ముఖ్యంగా మహిళల హక్కులు హరించబడుతున్నాయి. మహిళల కోసం రాజ్యాంగం కల్పించిన హక్కులను కాపాడుకోవడంలో మహిళాసంఘాలు సైతం వెనుకబడిపోయాయి. ఏదైనా సంఘటన జరిగిన సమయంలో మాత్రమే ధర్నాలు, ఆందోళన కార్యక్రమాలు చేపట్టి సంబంధింత అధికారులకు వినతి పత్రం సమర్పించి చేతులు దులుపుకుంటున్నాయి. సమస్య పరిష్కారం కాబడే వరకు గాని, నేరస్తులకు శిక్షలు పడే వరకు బాధితులకు అండగా నిలిచిన సందర్భాల్లేవు. మహిళా సంఘాల పరిస్థితి ఈ విధంగా వుండగా, స్వచ్ఛంద సంస్థల పరిస్థితి మరో విధంగా వుంటుంది. చెత్తకుప్పల్లో పడివున్న పసి కందులను అక్కున చేర్చుకునేందుకు ముందుకురాని ఎన్జీఓలు, ప్రచారం వుంటుందన్న ప్రాంతంలో మాత్రం ఎగబడిపోతుంటారు.

రాజకీయనేతలు, ఉన్నతాధికారుల నుంచి మెప్పుపొందాలని వీరు ఆరాటపడుతుంటారు. నిరాదరణకు గురికాబడిన మహిళలు, వెట్టిచాకిరి చేస్తున్న పసిమొగ్గల గురించి అసలు పట్టించుకోరు. రాష్ట్రప్రభుత్వం నుంచి నిధులు పొందే అనాధాశ్రమం వైపు అధికారులు ఏనాడు కన్నెత్తి కూడా చూడని పరిస్థితి వుంది. ఇకపోతే ప్రభుత్వం పరంగా మహిళల అభివృద్ధి, బాలికల సంక్షేమం గురించి పట్టించుకోవాల్సిన స్త్రీ, శిశు సంక్షేమ శాఖ అధికారిణిలు తమకెటువంటి సంబంధం లేదన్నట్లుగా వ్యవహరిస్తుంటారు. ఉన్నతాధికారుల నుంచి ఆదేశాలు వస్తే తప్ప వీరు కార్యాలయాలు వదలి బాధితుల వద్దకు వెళ్లరు.

## నర్తన విషయంలో ఉదాసీనత!

ఈ శాఖ అధికారిణి వ్యవహరిస్తున్న తీరుకు ఉదాహరణగా రాష్ట్రవ్యాప్తంగా ఇటీవల సంచలనం సృష్టించిన నర్తన ఉదంతాన్ని పేర్కొనవచ్చు. శారీరక సుఖం కోసం పరాయి పురుషునితో అక్రమ సంబంధం పెట్టుకొని కన్న కూతురి పట్ల ఉపాధ్యాయురాలు నాగచైతన్య అమానుషంగా వ్యవహరించిన విషయం అందరికి తెలిసిందే. ఈ సంఘటన మండల కేంద్రమైన వెంకటాచలంలో జరిగింది. ఈ పాపను నిర్బంధించిన ఇంటికి కూతవేటు దూరంలో తహశీల్దార్, మండల పరిషత్, ఐసిడిఎస్ ప్రాజెక్టు కార్యాలయాలు వున్నాయి. స్థానికులు స్పందించి పోలీసులకు సమాచారమిచ్చి పాపను రక్షించిన తర్వాత కూడా ప్రభుత్వ అధికారులు ఎవరూ కూడా పాపను చూసేందుకు రాలేకపోయారు.

టి.వి ఛానళ్లలోనూ, పత్రికల్లోనూ ప్రకటించిన మరుసటి రోజు ఆసుపత్రికి వెళ్లి ఫోటోలకు పోజులిచ్చారు. హైదరాబాద్‌లో వున్న స్త్రీ, శిశు సంక్షేమశాఖ డైరెక్టర్ ఉషారాణి నర్తన సంఘటనపై స్పందించి రీజినల్ డిప్యూటి డైరెక్టర్ సూయిజ్‌ను జిల్లాకు పంపడం జరిగింది. ఈమె వచ్చిన తర్వాతనే ఆ శాఖాధికారుల్లో కదలిక వచ్చింది. అప్పటి వరకు జిల్లాలోని ఏ శాఖ అధికారులు కూడా పట్టించుకోలేదు. గాయాలపాలైన నర్తనకు మెరుగైన వైద్యం అందించేందుకు ప్రభుత్వం అన్ని ఖర్చులను భరించాల్సి వుండగా దాతలు ముందుకొచ్చేంత వరకు జిల్లా కలెక్టర్ సైతం ఎటువంటి ప్రకటన చేయలేకపోవడం విమర్శలకు ఆస్కారం కల్పించినట్లయ్యింది.

చెన్నైలో వైద్య చికిత్సలు పొందుతున్న నర్తన బాగోగులు ఎవరు పట్టించుకుంటారన్న దానిపై అధికార యంత్రాంగం ఇప్పటివరకు స్పష్టమైన ప్రకటన చేయకుండా మల్లగుల్లాలు పడుతుంది. జిల్లా ఎస్పీ మాత్రం వసంతలక్ష్మి చారిటబుల్ ట్రస్టుకు నర్తన బాధ్యతను అప్పగిస్తామని ప్రకటన చేశారు. సరైన వైద్య చికిత్సలకు అయ్యే మొత్తం ఖర్చును ప్రభుత్వం భరిస్తుందని ప్రభుత్వం ప్రకటించింది. ఈ క్రమంలో వసంతలక్ష్మి చారిటబుల్ ట్రస్టు ఛైర్‌పర్సన్ మాత్రం ఇప్పటికి లక్షరూపాయలు తాను సొంతగా ఖర్చు చేసినట్లు చెబుతున్నారు. నర్తన పేరిట కొంత విరాళం ఈమెకు చేరినట్లు చెబుతున్నారు. ఐసిడిఎస్ అధికారులు నర్తన పేరున బ్యాంకు ఖాతా ప్రారంభించి దాతల నుంచి విరాళాలను స్వీకరిస్తున్నారు. తల్లి కర్కశత్వానికి బలైన నర్తన సంరక్షణ బాధ్యతలు ఎవరు స్వీకరిస్తారనేది ప్రశ్నార్థకంగా మారింది. ఇదిలా వుండగా గత వారంలో సూళ్లూరుపేటకు చెందిన ఓ యువతి సామూహిక అత్యాచారానికి గురయ్యింది. ఈ అవమానం భరించలేక ఆమె ఆత్మహత్య చేసుకుంది. మహిళలపై నిత్యం జరుగుతున్న అఘాయిత్యాలు ఒకటి రెండు రోజుల అనంతరం మరుగున పడిపోతున్నాయి. ప్రభుత్వంతోపాటు, మహిళా సంఘాలు ఇప్పటికైన స్పందించి మహిళలు, పసిపిల్లల హక్కుల కోసం రూపొందించిన చట్టాలను కఠినంగా అమలుకోసం కృషి చేస్తే బాగుంటుంది.



జిల్లాలో వైఎస్ జగన్ ఓదార్పు యాత్రకు సంబంధించిన పోస్టర్లను విడుదల చేస్తున్న ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, అనిల్‌కుమార్, కరుణాకర్‌రెడ్డి, గోపాల్‌రెడ్డి, ఉదయగిరి ఎమ్మెల్యే చంద్రశేఖర్‌రెడ్డి.




నెల్లూరు బిజెపి కార్యాలయంలో విలేకరులతో మాట్లాడుతున్న ఆ పార్టీ జిల్లా ఇన్‌ఛార్జి భానుప్రకాష్‌రెడ్డి. ప్రక్కన ఆ పార్టీ జిల్లా కార్యదర్శి మిదతల రమేష్, అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి, మాజీ అధ్యక్షుడు సురేంద్రరెడ్డి.



నెల్లూరు టౌన్‌హాల్‌లో జరిగిన బిసి విద్యార్థి సదస్సులో మాట్లాడుతున్న బిసి సంక్షేమ సంఘం రాష్ట్ర అధ్యక్షుడు ఆర్.కృష్ణయ్య. వేదికపై ఆచార్య ఆదిత్య, కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు.



టాటా సుమోలో స్మగ్లింగ్ చేస్తున్న ఎర్రచందనం దుంగలను స్వాధీనం చేసుకొన్న నెల్లూరు ఐదవ పట్టణ ఎస్ఐ శ్రీనివాసులురెడ్డి.

● బోగస్ పాసుపుస్తకాలుంటే

# క్రిమినల్ చర్యలు!

పట్టాదారు పాసుపుస్తకాలకు యూనిక్ నెంబర్‌ను కేటాయించనున్నట్లు తోటపల్లిగూడూరు మండల తహశీల్దార్ లక్ష్మీనారాయణ తెలిపారు. స్థానిక పంచాయితీ కార్యాలయంలో జరిగిన గ్రామసభలో ఆయన మాట్లాడుతూ పట్టాదారు పాసుపుస్తకాలపై జిల్లా, డివిజన్, మండల, గ్రామాలకు కేటాయించిన ఆయా నెంబర్లతోపాటు ఖాతా నెంబరు కూడా వుంటుందన్నారు. బోగస్ పుస్తకాలను గుర్తించేందుకు ఈ నెంబర్లను కేటా

### తోటపల్లిగూడూరు తహశీల్దార్ ప్రకటన

యించినట్లు తెలిపారు. యూనిక్ నెంబర్ లేని పాసుపుస్తకాలను బోగస్‌లుగా గుర్తించడం జరుగుతుందని, దీనికి బాధ్యులైన వారిపై క్రిమినల్ చర్యలు తీసుకొంటామన్నారు. యూనిక్ నెంబర్లు లేని పట్టాదారు పాసుపుస్తకాలకు ఇకపై బ్యాంకులు, సహకార సంస్థలు రుణాలు ఇవ్వవన్నారు. ఇప్పటికే రుణ సౌకర్యం కోసం బ్యాంకుల్లో వున్న పాసుపుస్తకాలకు సైతం యూనిక్ నెంబర్లు కేటాయిస్తారని రైతులు ఈ విషయంలో సహకరించాలని కోరారు.

# కావలి కాంగ్రెస్‌లో ప్రోటోకాల్ చిచ్చు!

● సర్దిన మునిసిపల్ ఛైర్మన్

ప్రోటోకాల్ వ్యవహారం కావలి మునిసిపాలిటీలో చిచ్చురేపింది. కాంగ్రెస్ పార్టీ పాలనలో వుండే మునిసిపాలిటీలో స్వపక్షీయులే నిరసనకు దిగడం చర్చనీయాంశమయ్యింది. 23లక్షల రూపాయలతో చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాల శంకుస్థాపనల్లో ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి పాల్గొన్నారు. దీనికి సంబంధించి ఏర్పాటు చేసిన శిలాఫలకంలో స్థానిక అధికారపక్ష కౌన్సిలర్లు కనమర్లపూడి వెంకటనారాయణ, షాహుల్ హమీద్ పేర్లు లేకపోవడంతో వారు తీవ్రంగా మండిపడ్డారు. కమిషనర్‌ను దీనిపై వారు నిలదీశారు. తమకు ఏమీ సంబంధంలేదని డిఆర్‌ఓ పేర్లను తొలగించారని చెప్పడంతో మరింత గందరగోళం నెలకొంది. డిఆర్‌ఓ ఎలా తొలగిస్తారని దీనిపై కోర్టుకు వెళ్తామని కౌన్సిలర్లు విరుచుకపడ్డారు. ఈ విషయాన్ని ఛైర్మన్ శ్రీనివాస కిరణ్ దృష్టికి తీసుకొనిపోవడంతో ఆయన సర్దుబాటు చేసి క్రొత్తగా పేర్లు రాయించి శిలాఫలకం ఏర్పాటు చేయిస్తానని హామీ ఇవ్వడంతో వివాదం సర్దుమణిగింది.

# స్లూయిజ్‌ల ద్వారా నీరు విడుదల చేయాలి!

స్వర్ణముఖి నదికి తెలుగు గంగ కాలువకు స్లూయిజ్‌లను నిర్మించి నీటి విడుదల చేసి రైతాంగాన్ని ఆదుకోవాలని వాకాడు, నాయుడుపేట ప్రాంత ప్రజలు కోరుకొంటున్నారు. స్వర్ణముఖి నది నీరు పంటలకు తగినంతగా అందడం లేదని, వర్షాలు పడనప్పుడు నీటికోసం రైతాంగం అష్టకష్టాలు పడుతున్నారని వాపోతున్నారు. కరెంటు వాడకం, ఖర్చులు పెరగడం వలన దిగుబడి తగ్గిపోతున్నదన్నారు. త్రాగునీటికి సమస్యలు ఎదురౌతున్నాయన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని స్వర్ణముఖి నదికి తెలుగుగంగ కాలువ నుంచి స్లూయిజ్‌లు నిర్మించి 500 క్యూసెక్కుల నీటిని విడుదల చేసేందుకు చర్యలు చేపట్టాలని కోరారు. ఈ నిర్ణయం తీసుకొంటే పంటలు సమృద్ధిగా పండడంతోపాటు, త్రాగునీటి ఇబ్బందులు తొలగుతాయన్నారు.

# దేముళ్లకు ఎంత కష్టం!

## రూ.39కోట్లున్నా ధూపదీప నైవేద్యాలు లేవు

కోట్ల రూపాయలు ఆస్తులున్నా కనీస సౌకర్యాలకు నోచుకోక, ఆలనా, పాలనా కరువై శిథిలావస్థకు చేరుకొన్నాయి ముత్తుకూరు మండలంలోని పురాతన ఆలయాలు. ధూప, దీప నైవేధ్యాలతో నిత్య పూజలతో కళకళలాడాల్సిన దేవాలయాలు పిచ్చిమొక్కలతో, పగుళ్లుచ్చి శిథిలమై వుండడం బాధాకరం. పారిశ్రామిక కేంద్రంగా అభివృద్ధి చెందుతున్న కృష్ణపట్నంలో గల శ్రీ సిద్దేశ్వరస్వామి, శ్రీ వేణుగోపాలస్వామి ఆలయాలు అతి పురాతనమైనవి. ఈ రెండు దేవాలయాలకు గ్రామ పరిధిలో 507 ఎకరాల భూమి వుండేది. థర్మల్ విద్యుత్ కేంద్రాల కోసం కొంత భూమిని ప్రభుత్వం సేకరించింది. నష్టపరిహారంగా రూ.38.93కోట్లు దేవాదాయ శాఖకు చెల్లించింది. ఈ మొత్తాన్ని రెండు దేవాలయాల పేరిట సంయుక్తంగా బ్యాంకులో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేశారు. కోట్లరూపాయల నిధులున్నా ఆలయాల సంరక్షణ పట్టించుకోనే వారే కరువయ్యారు. వందల ఏళ్ల క్రితం నిర్మించిన సిద్దేశ్వరాలయ గోపురం పగుళ్లిస్తోంది. వేణు గోపాల స్వామి ఆలయం శిథిలావస్థకు చేరుకొంది. వైభవంగా నిర్వహించాల్సిన ఉత్సవాలను తూతూ మంత్రంగా నిర్వహించి చేతులు దులుపుకొంటున్నారు. అర్చకులు వున్నా అధికారుల నుంచి సహకారం అందకపోవడంతో ధూప, దీప, నైవేద్యాలకు దిక్కు లేకుండా పోయింది. పురాతన ఆలయాలకు జీర్ణోద్ధరణ జరిపి ధూప, దీప నైవేద్యాలు సక్రమంగా జరిగేలా చూడాలని గ్రామస్తులు కోరుకొంటున్నారు.

● ఉదయగిరిలో

# జోరుగా పేకాట!

జిల్లా సరిహద్దుల్లో పేకాట జోరుగా సాగుతోంది. లక్షల రూపాయలు చేతులు మారుతున్న ఈ జూదానికి కడప, ప్రకాశం, నెల్లూరు జిల్లాల నుంచి పలువురు పేకాటరాయుళ్లు పెద్దఎత్తున వచ్చి పేకాట ఆడుతుండడంతో ఉదయగిరి పరిసర ప్రాంతాలు పేకాట కేంద్రాలుగా మారాయి. సీతారాంపురం మండలం అటవీ ప్రాంతాన్ని పేకాటకు అనువుగా మార్చుకొన్న కొందరు పెద్దఎత్తున దీనిని నిర్వహిస్తున్నట్లు సమాచారం. అటు కడప, ఇటు ప్రకాశం జిల్లాలకు సరిహద్దు ప్రాంతంగా వుండడంతో ఆయా ప్రాంతాల నుంచి నిత్యం

### పట్టించుకోని పోలీసు

వందలాదిమంది కార్లు, బైక్‌లపై వచ్చి ఇక్కడే మకాం వేసి పేకాటలో మునిగితేలుతున్నారు. వీరిలో పలువురు వ్యాపారులు, ప్రముఖులు, రాజకీయ నాయకులు వున్నట్లు సమాచారం. రోజుకో ప్రదేశాన్ని మారుస్తూ పేకాటను నిర్వహిస్తున్న నిర్వాహకులు ఇందుకోసం రోజుకు 50వేల రూపాయలకు పైగా వసూలు చేస్తున్నారట. పోలీసులు దాడికి వస్తున్నట్లు ముందే తెలుసుకొని స్థావరాలను మార్చడం నిర్వాహకులకు వెన్నతో పెట్టిన విద్య. పోలీసులను మచ్చిక చేసుకొని తమ కార్యక్రమాన్ని నిరాటంకంగా జరుపుకొంటూ లక్షలు గడిస్తున్నారు. వంటచెరకు కోసం అడవికి వెళ్లే మహిళలు పేకాటరాయుళ్ల దెబ్బకు హడలిపోతున్నారు. లక్షల రూపాయలు చేతులు మారుతున్న ఈ పేకాట కేంద్రాలపై పోలీసులు దాడులు నిర్వహించి అరికట్టాలని స్థానికులు కోరుకొంటున్నారు.

# నిర్లక్ష్యపు నీడలో ఆయుష్ కేంద్రాలు

## సిబ్బందికి జీతాలు లేవు

జిల్లాలోని ఆయుష్ పరిధిలోగల ఆస్పత్రులు నిర్లక్ష్యపు నీడలో కొట్టుమిట్టాడుతున్నాయి. జిల్లావ్యాప్తంగా 25 ఆయుర్వేద వైద్యశాలలు, 13 హోమియో, 12 యునాని వైద్యశాలలు ఆయుష్ పరిధిలో పనిచేస్తున్నాయి. ఈ వైద్య విధానానికి ప్రోత్సాహం ఇస్తున్నట్లు నిధులు మంజూరు చేస్తున్నట్లు ప్రభుత్వం ఆర్భాటంగా ప్రకటించడం తప్ప ఆచరణలో అమలుకాకపోవడంతో మందుల కొరత ఒక వైపు, సిబ్బందికి జీతాలు అందక మరోవైపు సమస్యలు కొలువై వుంటుండడంతో ఇవి నామమాత్రమైనాయి. ఇటీవల కాలంలో ఆయుర్వేదం, హోమియో, యునాని వైద్యంపై ప్రజల్లో ఆదరణ పెరగడంతో ఈ ఆస్పత్రులకు వచ్చే వారి సంఖ్య అధికంగానే వున్నప్పటికీ ప్రభుత్వం తగినవిధంగా మందులను సరఫరా చేయకపోవడంతో రోగులు వచ్చినప్పటికీ ఇచ్చేందుకు మందులు లేక వైద్యులు ఖాళీగా కూర్చోవలసి వస్తుంది. మరోవైపు గత తొమ్మిది నెలలుగా ఆయుష్ పరిధిలోగల ఆస్పత్రులలో పనిచేసే సిబ్బందికి జీతాలు చెల్లించకపోవడంతో వారి పరిస్థితి దయనీయంగా వుంది. ప్రజల్లో వున్న ఆదరణను గుర్తించైనా ప్రభుత్వం వీటికి మందులను పంపిణీ చేయాలని, సిబ్బందికి జీతభత్యాలను చెల్లించాలని ఆయాప్రాంతాల ప్రజలు కోరుకొంటున్నారు.

# వెంకటగిరిలో అంధకారం!

## విద్యుత్ శాఖకు బకాయిలు చెల్లించని మునిసిపాలిటీ.

పాలకుల పుణ్యమా అని ప్రజలు అంధకారంలో మగ్గాల్సిన దుస్థితి వెంకటగిరిలో దాపురించింది. మునిసిపాలిటీ ట్రాన్స్‌కోకు 40లక్షల రూపాయలు బాకీపడడంతో వారు మునిసిపల్ కార్యాలయానికి, వీధి దీపాలకు విద్యుత్ సౌకర్యం తొలగించారు. దీంతో పట్టణంలో అంధకారం అలుముకొంది. బకాయిలు చెల్లింపులో నాలుగేళ్లుగా కాలయాపన చేస్తూ వస్తుండడం, పాలకవర్గం, అధికారుల నిర్లక్ష్యంగా వ్యవహరించడంతో విద్యుత్ సరఫరా తొలగించక తప్పలేదని ట్రాన్స్‌కో అధికారులు చెప్తున్నారు. వీధిదీపాలు వెలగకపోవడంతో పట్టణంలో సందుగొందుల్లో చీకటి అలుముకొంది. వివిధ షాపులు తెరచి వుండడంతో వాటిలోని విద్యుత్ కాంతులతో కొంతమేర ప్రజలు తిరగగలిగారు. ఈ విషయాన్ని తెలుసుకున్న ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ మునిసిపల్ కమిషనర్‌పై మండిపడ్డారు. మునిసిపాల్టీకి వచ్చే జనరల్ ఫండ్‌ను కాంట్రాక్టర్లకు చెల్లించడంతో ఈ సమస్య ఎదురైనట్లు తెలుస్తుంది. ప్రజల కంటే కాంట్రాక్టర్లకు అధికారులు ప్రథమ తాంబూలం ఇవ్వడంపై ప్రజలు ఆగ్రహిస్తున్నారు.

# మైక్రో ఫైనాన్స్ ఉచ్చులోపడి విలవిల

మైక్రోఫైనాన్స్ ఉచ్చులో చిక్కుకొని జిల్లాలోని పలువురు విలవిల్లాడుతున్నారు. అవసరానికి తీసుకున్న అప్పుకు అధికవడ్డీ వసూలు చేస్తుండడం, డబ్బుకట్టకపోతే దౌర్జన్యం చేసి మరీ రాబట్టుకొంటుండడంతో మైక్రోఫైనాన్స్‌ల దెబ్బకు సాధారణ ప్రజానీకం హడలిపోతున్నారు. జిల్లా అంతటా మైక్రోఫైనాన్స్ పేరుతో అనధికారికంగా కోట్ల రూపాయల వ్యాపారం సాగుతుంది. నెల్లూరు, కావలి, గూడూరు, నాయుడుపేట, సూళ్లూరుపేట, ఉదయగిరి, ఆత్మకూరు, వెంకటగిరి ప్రాంతాల్లో ఇది చాపక్రింద నీరులా సాగిపోతుంది. ఉందమ్మ బొట్టు పెడతా, స్పందన, మైక్రో, వరలక్ష్మి, ధనలక్ష్మి, లక్ష్మి, గృహలక్ష్మి తదితర పేర్లతో ఈ సంస్థలు తమ కార్యకలాపాలను నిర్వహిస్తూ కోట్లరూపాయలు వ్యాపారం

### పేదలకేది దారి?

చేస్తు పేదల నుంచి అధికవడ్డీ వసూలు చేస్తున్నారు. పేదరికం కారణంగా మైక్రో ఉచ్చులో చిక్కుకొనే మహిళలు ఆ అప్పుతీర్చలేక, నిర్వాహకులు పెట్టే మానసిక క్షోభ తట్టుకోలేక ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. నెల్లూరు నగరంలోని కిసాన్‌నగర్, నవాబుపేట, కొండాయపాళెం, టైలర్స్ కాలని, బుజబుజ నెల్లూరు, తోటపల్లిగూడూరు మండలం మల్లిఖార్జున పురంలో పలువురు ఆత్మహత్యలకు పాల్పడిన ఘటనలు వున్నాయి. ఇంతగా మైక్రోఫైనాన్స్ సంస్థలు అనధికారికంగా తమ కార్యకలాపాలు సాగిస్తున్నా అధికారులు వాటిని అణచివేయడంలో తగినచర్యలు చేపట్టకపోవడంతో పేదలు చితికి పోతున్నారు.

# వణికిస్తున్న డెంగ్యూ

బోగోలు మండల ప్రజలను డెంగ్యూవ్యాధి వణికిస్తుంది. మండలంలోని పలు గ్రామాల్లో డెంగ్యూ వ్యాధి బారిన పడిన ప్రజలు ఆస్పత్రుల్లో చికిత్స పొందుతున్నారు. కోవూరుపల్లి పంచాయితీలో బుజ్జమ్మ అనే మహిళ డెంగ్యూ వ్యాధికి గురై మరణించింది. బిసి కాలనీ మహిళను చెన్నైకు తరలించి వైద్యచికిత్స అందిస్తున్నారు. కడనూతల, తెల్లగుంట, తాళ్లూరు, జువ్వలదిన్నె, తాటిచెట్లపాళెం, కోళ్లదిన్నె, ముంగమూరు, కొండబిట్రగుంట, కపాడిపాళెంలోనూ పలువురు జ్వరాలతో బాధపడుతున్నారు. దీనికి కారణం ఈ ప్రాంతాలల్లో పారిశుధ్యం క్షీణించడమే. అధిక సంఖ్యలో ప్రజలు డెంగ్యూవాధి, వైరల్ జ్వరాల బారిన పడుతున్నప్పటికీ అటు అధికారులు ఇటు పాలకులు తగిన చర్యలు చేపట్టడంలో నిర్లక్ష్యం ప్రదర్శించడం పట్ల ప్రజల్లో తీవ్ర నిరసన వ్యక్తమవుతోంది.

# ఇన్ని థర్మల్ విద్యుత్ కేంద్రాలా?

ప్రభుత్వం జిల్లాలో వున్న పేద రైతుల నోళ్లుకొట్టి థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులను నెలకొల్పాలని చూస్తున్నదని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి విమర్శించారు. ఇటీవల మరణించిన మండలస్థాయి నేత కుటుంబాన్ని పరామర్శించేందుకు మనుబోలుకు వచ్చిన ఆయన పనిలో పనిగా తీర ప్రాంత గ్రామాలలో నిర్మాణంలో వున్న థర్మల్ విద్యుత్ కేంద్రాల గురించి విలేకరులతో మాట్లాడుతూ ప్రపంచదేశాలన్నీ పర్యావరణ సమతుల్యాన్ని దెబ్బతీసే థర్మల్ పవర్ ప్రాజెక్టులను తగ్గించుకొంటుంటే మన ప్రభుత్వం మాత్రం రైతులు వ్యతిరేకిస్తున్నప్పటికీ వాటిని నెలకొల్పేందుకు అనుమతి ఇవ్వడం సిగ్గుచేటన్నారు. తప్పుడు నివేదికలతో ప్రాజెక్టులకు అనుమతి తెచ్చుకొన్నా రని, వీటి వలన కోట్ల రూపాయలు విలువ చేసే భూములను రైతులు నష్టపోయారని తెలిపారు. దీనికి వ్యతిరేకంగా రైతులతో కలసి ఉద్యమిస్తామని ప్రకటించారు.

# దుస్థితిలో దేవాలయాలు

## వెంకటగిరిలో ఆలనా, పాలనా లేని దేవుళ్లు

వెంకటగిరి నియోజకవర్గ పరిధిలోని పలు దేవాలయాల పరిస్థితి దీనంగా వుంది. దేవాదాయశాఖ పరిధిలోగల ఈ ఆలయాలకు ఆస్తులున్నా ఆలనా పాలనా లేక, ధూప దీప, నైవేద్యాలకు కష్టంగా మారింది. పలు పురాతన ఆలయాలు, వాటిలోని శిల్ప సంపద కనుమరుగయ్యే పరిస్థితి నెలకొనింది. వెంకటగిరిలోని వరదరాజస్వామిగుడి గోపురం పురాతనమైనది. జీర్ణోద్ధారణ జరపాల్సివున్నా పట్టించుకొనేవారు లేకుండాపోయారు. బంగారుపేటలోని వేణుగోపాలస్వామి ఆలయానికి వందల ఎకరాలు వున్నా అతీగతీ లేదు. బాలాయపల్లి మండలంలోని సుబ్రహ్మణ్యేశ్వరాలయం రాజుల కాలం నాటిది. అదీ శిథిలావస్థకు చేరుకొంది. నిడిగల్లులో 300ఏళ్ల నాటి చెన్నకేశవాలయం, పెరిమిడిలోని భీమేశ్వరాలయం శిథిలమైపోయాయి. దగ్గవోలులోని శివాలయం కూలిపోగా, చెన్నకేశవాలయం కూలిపోయే స్థితిలో వుంది. వెంబులూరు నృసింహ మందిరం, మోపూరు చెన్నకేశవస్వామి ఆలయాలది ఇదే పరిస్థితి. ఇంతగా ఆలయాలు శిథిలమైపోతున్నా సంబంధిత అధికారులు పట్టించుకోక పోవడంపై ప్రజలు నిరసన తెలుపుతున్నారు.

# జడ్పీపాఠశాలల అభివృద్ధికి నిధులు!

## జడ్పీ ఛైర్మన్ గోవర్ధన్‌రెడ్డి వెల్లడి

జిల్లా పరిషత్ పాఠశాలలు ఇక కొత్త రూపును సంతరించుకోనున్నాయి. మౌలిక సదుపాయాల కల్పనకు, పాఠశాలల అభివృద్ధికి రూ.37.5కోట్లను మంజూరు చేసింది ప్రభుత్వం. జిల్లాపరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి దీనికి సంబంధించిన వివరాలను తెలియజేశారు. దాదాపు అన్ని పాఠశాలలకు అభివృద్ధి నిధులు అందనున్నాయని తెలిపారు. తొలి విడతగా 64 పాఠశాలలకు రూ.24కోట్లు మంజూరయ్యాయని, రెండవ విడతలో మిగిలిన పాఠశాలలకు నిధులు విడుదలవుతాయని తెలిపారు. రూ.37.5కోట్ల రూపాయలతో జిల్లా పరిషత్ పాఠశాలల్లో మౌలిక సదుపాయాలను కల్పించి, పూర్తిస్థాయిలో అభివృద్ధి పరచాలన్నదే లక్ష్యం అన్నారు. ఈ పనులకు ఆన్‌లైన్ ద్వారా టెండర్లు నిర్వహించి అవకతవకలకు తావులేకుండా పటిష్ట చర్యలు చేపడుతున్నట్లు వివరించారు. ప్రతి పాఠశాలకు భవనం, త్రాగునీరు, మరుగుదొడ్లు, విద్యుత్ సౌకర్యం కల్పించనున్నట్లు గోవర్ధన్‌రెడ్డి చెప్పారు.

● కోవూరు పంచాయితీలో

# స్వాహాపై రగడ!

కోవూరు పంచాయితీలో 50 లక్షలు స్వాహా అయినట్లు తెలుగుదేశం నేత చేజర్ల వెంకటేశ్వర్లురెడ్డి ఆరోపించడంపై కలకలం రేగింది. చేజర్ల వ్యాఖ్యలపై స్థానిక సర్పంచ్ శివుని నరసింహారెడ్డి తీవ్రంగా స్పందించారు. నాలుగేళ్ల తన పదవీ కాలంలో ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టానని వివరించారు. పారిశుధ్యాన్ని మెరుగుపరచేందుకు రెండో ట్రాక్టర్‌ను కొనుగోలు చేశామన్నారు. దీనిని విస్మరించి వెంకటేశ్వర్లు

### చేజర్ల X శివుని

రెడ్డి బ్లాక్‌మెయిలింగ్‌కు పాల్పడుతూ చౌకబారు విమర్శలకు దిగడాన్ని ఖండించిన ఆయన ప్రతి విమర్శలు చేశారు. గత 5 ఏళ్లుగా ఇంటిపన్ను కట్టని వ్యక్తి చేజర్ల అని ఆరోపించారు. తాము గట్టిగా అడిగే సరికి ఇటీవల పన్నుకట్టిన ఆయనకు తమను విమర్శించే అర్హత లేదన్నారు. 50 లక్షల రూపాయల నిధులు దుర్వినియోగం అయినట్లు నిరూపిస్తే సర్పంచ్ పదవికి రాజీనామా చేస్తానని ప్రకటించారు.

## అడకత్తెరలో 'రఘువీరా'



వ్యవసాయ మంత్రి రఘువీరారెడ్డి పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా వుంది. వైఎస్‌కు అత్యంత సన్నిహితుడిగా మెలిగిన రఘువీరాకు ఇప్పుడు అదే గుదిబండలా మారింది. వైఎస్.బామ్మర్ది, కడప మేయర్ రవీంద్రనాథరెడ్డికి సంబంధించిన ఎరువుల మిక్సింగ్ ప్లాంట్ల అవినీతిపై చర్య తీసుకునే బాధ్యత రఘువీరాపై పడింది. దీంతో ఆయన పరిస్థితి కరవమంటే కప్పకు, వదలమంటే పాముకు కోపం అన్న విధంగా మారింది. రవీంద్రనాథరెడ్డిపై చర్య తీసుకుంటే వైఎస్ వర్గం నుంచి ప్రతిఘటన ఎదురవుతుంది. అలాగని ఊరుకుంటే ఇటు వైఎస్ వ్యతిరేకుల నుంచి, ప్రతిపక్షాల నుంచి వత్తిడిని ఎదుర్కోవాలి. ఏంచేయాలో దిక్కుతోచడం లేదు రఘువీరాకు. ఇటువంటి పరిస్థితి శత్రువుకు కూడా రాకూడదంటూ రఘువీరా మొత్తుకుంటున్నాడు. ప్చ్! ఏంచేద్దాం!!

## కాంగ్రెస్‌లో కెసిఆర్ లొల్లి



కాంగ్రెస్ పార్టీలో కెసిఆర్ లొల్లి ఎక్కువైంది. తెలంగాణ కాంగ్రెస్ వాదులు కొందరు కెసిఆర్‌కు అనుకూలంగా మారారు. కాగా మరికొందరు వ్యతిరేక గ్రూపుగా తయారయ్యారు. దీంతో కెసిఆర్ కాంగ్రెస్‌కు కేంద్ర బిందువయ్యాడు. శ్రీకృష్ణ కమిటీ రిపోర్టు తెలంగాణకు అనుకూలంగా వస్తే కెసిఆర్ బలం పెరుగుతుందని నమ్ముతున్న కాంగ్రెస్ వాదులంతా ఆయనకు జై కొడుతున్నారు. కాంగ్రెస్‌కు ఈ పరిణామం ఇబ్బందిగా మారింది. కెసిఆర్ కారణంగా పార్టీలో తలనొప్పులు రావడం ఏమిటంటూ అధిష్టానం ఆరా తీస్తోంది. ఈ పరిస్థితుల్లో సమాధానం చెప్పుకోలేక ముఖ్యమంత్రి, పిసిసి చీఫ్ తెగ ఇబ్బంది పడుతున్నారు. ఈ గొడవను ఎలా పరిష్కరించాలో అర్థం గాక సిఎం అధిష్టానంపైనే భారం వేయాలని నిర్ణయించాడట. దటీజ్ రోశయ్య!!

## డిఎస్ 'లా'జిక్



ఉరుమురిమి మంగలం మీద పడిన సామెతలా వుంది పిసిసి చీఫ్ డి.శ్రీనివాస్ లాజిక్. కాంగ్రెస్ పార్టీలో కీచులాటలకు మీడియానే కారణమంటూ ఈ మధ్య రుసరుసలాడుతున్నాడు. తమ పార్టీలో అసలు గొడవలే లేకపోయినా మీడియా వాళ్లు పెట్టే తుంపులు వల్ల పరువు పోతోందంటూ స్టేట్‌మెంట్ కూడా ఇచ్చాడు. తెలంగాణ ప్రాంత మంత్రులు, ఎమ్మీల మధ్య వివాదం ముదిరి రచ్చకెక్కింది. కాంగ్రెస్ ఎమ్మీలు కెసిఆర్ బాకా ఊదుతూ పార్టీని బజారులోకీడుస్తున్నారని కొందరు మంత్రులు మండిపడగా, అసలు మంత్రులే సీమాంధ్ర నాయకుల బూట్లు నాకుతున్నారని ఎమ్మీలు ఎదురుదాడికి దిగారు. దీంతో తెలంగాణ కాంగ్రెస్ చేపల బజారులా తయారైంది. పిసిసి చీఫ్‌కు ఈ పరిస్థితి మింగుడు పడటం లేదు. ఈ గొడవపై మీడియా పిసిసి చీఫ్‌ను నిలదీయడం ఎక్కువైంది. దీంతో చిరాకెత్తిన డిఎస్ అసలు ఈ గొడవకంతకూ మీరే కారణమంటూ మీడియాపై మండిపడుతున్నాడు..ప్చ్..పాపం!!

## పార్టీ తెరపై మాజీ స్పీకర్



శాసనసభ మాజీ స్పీకర్ కెఆర్.సురేష్‌రెడ్డి ఈ మధ్య కాంగ్రెస్‌లో క్రియాశీలకంగా కనిపిస్తున్నాడు. గత ఎన్నికల్లో ఓడిపోయాక చాలా కాలం తెరవెనుకనే వుండిపోయాడు. అయితే ఇటీవల పిసిసి చీఫ్‌గా ఆయన పేరు తెరపైకి వచ్చింది. అప్పటి నుంచి సురేష్‌రెడ్డి పార్టీ కార్యక్రమాల్లో ప్రముఖంగా కనిపిస్తున్నాడు. ఆయన స్పీకర్‌గా వున్నప్పుడు ప్రారంభించిన పీస్‌ఫర్ గ్లోబల్ ఆర్గనైజేషన్‌కు దుమ్ముదులిపి తాజాగా తెరపైకి తెస్తున్నాడు. ఈ సంస్థ ఆధ్వర్యంలో వచ్చేవారం కోటి మందితో శాంతి ప్రతిజ్ఞ చేయిస్తానంటున్నాడు. ఈ కార్యక్రమానికి ముఖ్యమంత్రి, మంత్రులతోపాటు అన్ని పార్టీల నాయకుల్ని కూడా ఆహ్వానించాడు. రెండో ఇన్నింగ్స్‌కు ఈ మాత్రం హడావుడి తప్పనిసరి అంటూ సిఎల్‌పిలో ఎమ్మెల్యేలు చెవులు కొరుక్కుంటున్నారు. వింటున్నారా! సురేష్!!

## ట్రం కు రో డ్డు



## గోపాలరెడ్డి గొప్ప ప్రజాసేవకుడట?




డిసిసి అధ్యక్షుడు ఎల్లసిరి గోపాలరెడ్డి పార్టీ కోసం చేసిన సేవ ఏమిటో జిల్లా ప్రజలందరికీ తెలుసు. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి మూలంగా జాక్‌పాట్ కొట్టిన ఆయన కృతజ్ఞత తీర్చుకోను జిల్లాలో జగన్ యాత్రకు జై కొట్టారు. రాష్ట్రంలో ఏ డిసిసి అధ్యక్షుడు ఓదార్పులో పాల్గొనమని గోపాలరెడ్డి తరహాలో పిలుపివ్వకపోవడంతో పిసిసి ఆయనకు సంజాయిషీ నోటీసు ఇచ్చింది. ఈ నోటీసు గోపాలరెడ్డి ఊహించిందే కాబట్టి పెద్దగా ఫీల్ కాలేదు. కానీ హైదరాబాద్‌లో మాజీ ఎమ్మెల్యే బాజిరెడ్డి గోవర్ధన్‌రెడ్డి గోపాలరెడ్డికి అనుకూలంగా మాట్లాడిన మాటలు నెల్లూరీయులకు పెద్ద జోకుల్లా తోచాయి. "గోపాలరెడ్డి 30 ఏళ్లుగా పార్టీకి గొప్ప సేవ చేశాడు(?) ఆయనకు ఏమైనా ఎమ్మీ, ఎమ్మెల్యే పదవులిచ్చారా అంటే అదీ లేదు. నిస్వార్థ సేవకునికి షోకాజ్‌తో మంచి బహుమానాన్ని ఇచ్చారు. పిసిసి ద్వంద్వ ప్రమాణాలు పాటిస్తుంది. ఓదార్పులో పాల్గొన్న మంత్రులు, ఎమ్మెల్యేలకు మాత్రం నోటీసులివ్వలేదని" రెచ్చగొట్టేలా మాట్లాడిన ఆయన ధోరణి ట్రంకురోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

## తెలంగాణ ద్రోహులు వారు!



నెల్లూరు సిపిఎం పార్టీ జిల్లా కార్యదర్శి తమ్ములగుంట ప్రపంచ భానురాజుకు పొలిటికల్ నాలెడ్జ్ ఎక్కువ. పుస్తకాల పురుగైన ఆయన పార్టీ ఆధ్వర్యంలో జరిగిన తెలంగాణ సాయుధపోరాట 62వ వార్షికోత్సవ సభలో స్వరం పెంచి మాట్లాడారు. నిజాం నవాబుకు, రజాకార్లకు అనుకూలంగా పనిచేసిన కుటుంబం తెరాస నేత చంద్రశేఖర్‌రావుది. రజాకార్లకు అనుకూలంగా వుండడం వల్ల ఎమ్మీ విజయశాంతి కుటుంబాన్ని తెలంగాణ నుంచి తరిమివేస్తే కృష్ణాజిల్లాకు వెళ్లి స్థిరపడ్డారు. గురివింద గింజ సామెతను గుర్తు తెచ్చే వీళ్లా తెలంగాణను తెచ్చేదని 'భాను' రెచ్చిపోయేసరికి సిపిఎం కార్యకర్తలు శాంతి కళ్యాణ మండపంలో చప్పట్లమోత మోగించారు. భానురాజు విమర్శలు మాటల మాయగాడు చంద్రశేఖర్‌రావుకు తెలిపేదెవరు?

## ఒక నవ్వు – ఒక విమర్శ



నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి దేశసంచారంలో వున్నా సరే ఏదో ఒక సెంటర్‌లో మీడియాతో చిత్రంగా మాట్లాడుతాడు. దాంతో ఆయన మాటలను ప్రత్యేకంగా టివీలు ప్రసారం చేస్తాయి. పత్రికలు ప్రచురిస్తాయి. గతవారం నుంచి నెల్లూరులో లేని వివేకా బయట నుంచే తెలంగాణ న్యాయవాదులు హైకోర్టులో రెచ్చిపోయిన అంశంపై ఇంకాస్త తీవ్రంగా రెచ్చిపోయారు. అదేదో సినిమాలో హీరో చిరంజీవి పాట పాడినట్లు న్యాయవాదులే న్యాయదేవత కొంగు లాగితే ఎలా అంటూ స్టైలిష్‌గా మాట్లాడారు. ప్రత్యేక పిసిసి అడిగిన తెలంగాణ కాంగ్రెస్ నేతలకు కొరివి కారంతో భోజనం పెట్టినట్లుగా ఒక నవ్వు నవ్వి – మొన్నటి ఉప ఎన్నికల్లో 12 సీట్లతో ఓడిన వీరికా అంటూ ఎన్టీఆర్ స్టైలును అనుకరించి తనలోని బహురూప విద్యను ప్రదర్శించారు.

## కొత్త నోట్లే ఇవ్వండి!




జనరల్‌గా కాస్త చిరిగిన, నలిగిన నోట్లుంటే జనం బ్యాంకులలో జమ చేస్తుంటారు. నోట్లను లెక్కించే మిషన్లను పెట్టుకొన్న నెల్లూరు బ్యాంకర్లు చిరిగిన, నలిగిన నోట్లను తీసుకోవడం లేదు. తిరిగి వినియోగదారులకు ఇచ్చేస్తున్నారు. దీంతో జనం బ్యాంకుల్లో జగడాలకు దిగుతున్నారు. ఇటువంటి నోట్లను వారంలో ఒకే రోజు ఒక గంట మాత్రమే తీసుకొంటున్నట్లు స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా మెయిన్ బ్రాంచ్ సిబ్బంది జనాన్ని మరింత చిర్రెత్తిస్తున్నారు. అయినా కొత్త నోట్లు జనం ఎక్కడ నుంచి తెస్తారు?

## ఏమాయ చేశారు!




వున్నది లేనట్లుగా లేనిది వున్నట్లుగా చూపే వాళ్లను మాయగాళ్లు అంటుంటారు. రాష్ట్ర మునిసిపల్ మంత్రి, నెల్లూరు ఎమ్మీ, నగర, రూరల్ ఎమ్మెల్యేలు, మేయర్, ప్రతిపక్షీయులైన ఉపమేయర్, కార్పొరేటర్లు అందరూ కలిసి నెల్లూరు ప్రజలను మాయచేసి మోసగించారు. ఎల్‌అండ్‌టి వంటి ప్రతిష్టాత్మక కంపెనీ చేపట్టిన నెల్లూరు చెరువులో సమ్మర్ స్టోరేజి ట్యాంకు నిర్మాణపు పని 60 శాతమే పూర్తయ్యింది. కానీ ఇక్కడ నుంచి నీటిని ట్రైల్‌రన్ వేసినట్లు జనానికి నీటిని సరఫరా చేస్తున్నట్లు మాయచేసి మునిసిపల్ మంత్రే ఈ పథకాన్ని రిమోట్ కంట్రోల్ ద్వారా ప్రారంభించారు. కేవలం షెల్, క్రింద ఫ్లోర్‌లో రెండు, మూడు గదులు మాత్రమే పూర్తయిన కార్పొరేషన్ కార్యాలయాన్ని ఇదేతీరులో ప్రారంభించి నెల్లూరు నేతలంతా మహానగరంలో మాయగాళ్లు అనిపించుకొన్నారు. ప్రజలు వీళ్ల దుంపతెగ అని లోలోన అనుకోవడం తప్ప మరో మాటను పైకి అనలేక పోతున్నారు.

● **అయోధ్య మీద**

# అలహాబాద్ కోర్టు తీర్పుపై సర్వత్రా ఉత్కంఠ!

**ఒక న్యాయస్థానం ఇచ్చే తీర్పు పట్ల ఇంతటి ఉత్సుకత, ఇంతటి ఉత్కంఠ, ఇంతటి భయాందోళనలు, ఇంతటి అలజడి, ఇంతటి ఉద్రిక్తత మున్నెన్నడూ లేదు. ప్రపంచ చరిత్రలోనే దీనితో పోల్చదగిన సాదృశ్యం మరొకటి కన్పించదు.**

ఈ సెప్టెంబర్ 24తేది మన దేశ చరిత్రలో ఒక కీలక ఘట్టం ఆవిష్కరణ జరగబోతున్నది. ఎప్పటికీ మరచిపోలేని చేదు జ్ఞాపకంగా మిగలబోతున్నది. ఆరోజు ఏమౌతుందోనని యావత్ జాతి వూపిరి బిగపట్టి, ఉత్కంఠతతో ఎదురు చూస్తున్నది. ఆరోజుతో మొదలు కానున్న పరిణామాలను ఎదుర్కోవడం ఎట్లా అన్న సమస్యకు పరిష్కారం దొరకక కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తల పట్టుకొని వున్నాయి. పోలీసులు, సైన్యం, సరిహద్దు భద్రతా బలగాలు, పారామిలటరీ దళాలు... అవీ ఇవీ అని ఏమిటి, సకల రక్షణ యంత్రాంగమూ ఆ పెను సవాలు కోసం సన్నద్ధమౌతున్నది. ఫలానా రోజు నీకు మరణం అని ఏ జోతిష్యుడైనా చెప్తే, దాన్ని విన్నవాడి మానసం వలె వుంది భారతీయ సమాజం స్థితి ఇప్పుడు.



అయోధ్యలోని బాబ్రీ మసీదు.

వందకోట్ల మంది బ్రతుకులు ఇంతగా కల్లోల పరుస్తున్న ఘటన – అయోధ్య వివాదంపై అలహాబాద్ కోర్టు వెలువరించనున్న తీర్పు మాత్రమే. ఒక న్యాయస్థానం ఇచ్చే తీర్పు పట్ల ఇంతటి ఉత్సుకత, ఇంతటి ఉత్కంఠ, ఇంతటి భయాందోళనలు, ఇంతటి అలజడి, ఇంతటి ఉద్రిక్తత మున్నెన్నడూ లేదు. ప్రపంచ చరిత్రలోనే దీనితో పోల్చగల్గిన సాదృశ్యం మరొకటి కన్పించదు.

అయోధ్య వివాదం వయస్సు 482 ఏళ్లు. 1526లో ఇక్కడొక మసీదు నిర్మించారు. దాని నిర్మాతలెవరన్న దగ్గర నుంచి, అన్నీ వివాదాలే. తొలి మొగల్ చక్రవర్తి బాబర్ దీన్ని నిర్మించాడని ఒక వాదన. కాదు ఆయన ప్రతినిధి అయిన మీర్‌బాక్వి కట్టించాడని వేరొక వాదన. కొన్ని వేల సంవత్సరాలుగా ఈ ప్రదేశంలో వుండిన రామజన్మ భూమి మందిరాన్ని కూలదోసి, మసీదు కట్టారని ఒక వాదన. కాదు, అక్కడ రామాలయమే లేదు అని వేరొకవాదన. ఇవన్నీ అసత్యాలు, మసీదు నిర్మాణానికి ముందు ఇక్కడ వున్నది జైన మందిరం అని జైనులు గొడవ.

బాబ్రీ మసీదు ఎంత పురాతనమైనదో, దానిపై వివాదం కూడా అంతే పాతది. 1853లో మొదటి సారిగా మసీదును కూల గొట్టి, రామమందిరం నిర్మించే ప్రయత్నం జరిగింది. అప్పట్లో ఈ ప్రాంతాన్ని అవధ్ నవాబులు, వాజిద్ ఆలీ షా పరిపాలించాడు. హిందు, ముస్లింలు గొడవ పడడం ఆయనకు నచ్చలేదు. రెండేళ్లపాటు ఇరు వర్గాల మధ్య సయోధ్య కుదర్చడానికి చేసిన ప్రయత్నం విఫలం కావడంతో, ఈ వివాదాస్పద స్థలంలో ముస్లింలు ప్రార్థన చేయరాదని, అట్లే హిందువులు దానిలోపలకు ప్రవేశించరాదని ఫర్మానా జారీ చేశాడు. అప్పటివరకు హిందు, ముస్లింలు ఇరువురూ ఇక్కడ ప్రార్థనలు చేసుకొనేవారట. 1857లో తొలి స్వాతంత్ర్య సంగ్రామం సమయంలో బ్రిటిష్ పాలకులు, మసీదు వెలుపల ఒక గోడ కట్టించి, దానికి ఆనుకొని హిందువులు ప్రార్థన చేసుకోవడానికి ఒక అరుగు నిర్మించి ఇచ్చారు. మసీదు ఆవరణంలోకి హిందువులు ప్రవేశించకుండా కట్టడి చేశారు. 1883లో మసీదు వెలుపల కట్టిన అరుగు మీద ఒక రామాలయం నిర్మించడానికి ప్రయత్నం జరిగింది.



విధ్వంసానికి గురైన బాబ్రీ మసీదు.

ఫైజాబాద్ కలెక్టర్ దాన్ని అడ్డుకొన్నారు. దానితో రఘుబీర్ దాస్ అనే హిందు మహంత 1885లో ఫైజాబాద్ కోర్టులో ఒక కేసు దాఖలు చేశాడు. 17 అడుగుల వెడల్పు, 21 అడుగుల పొడుగు కల్గిన, ఐదంకణాల స్థలం తమకిస్తే అక్కడ రామాలయం నిర్మించుకొంటామన్నది ఆ కేసు సారాంశం. బాబ్రీ మసీదు మొత్తం విస్తీర్ణం దాదాపు 167 ఎకరాలు. అందులో హిందు మత గురువు అడిగింది కేవలం ఐదు అంకణాలు మాత్రమే. ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం దాన్ని అనుమతించి వుంటే పరిస్థితి ఎట్లా వుండేదో తెలియదు. అయితే ఫైజాబాద్ జిల్లా న్యాయ

కొరవ 14వ పేజీలో

**ఈ తీర్పులో చాలా మౌలిక ప్రశ్నలకు సమాధానాలు వెలుగు చూడవలసి వుంది. వాటిలో ప్రధానమైనవి ఇవీ...**

- బాబ్రీ మసీదు కట్టడం, ముస్లిం సంస్థలు వాదిస్తున్నట్లు నిజంగా మసీదేనా?
- అది నిజమైతే, దాన్ని కట్టించెవరు? మొగల్ చక్రవర్తి బాబరా లేక ఆయన ప్రతినిధి మీర్ బాక్వి తప్పుంది నా?
- ఆ కట్టడానికి ముందు అక్కడ హిందు దేవాలయం ఏదైనా వుందా?
- బాబ్రీ మసీదు కట్టినప్పటి నుంచి దానిలో ముస్లింలు నమాజు చేస్తున్నారా?
- ఇది రాముడి జన్మస్థలమనేందుకు ఆధారాలున్నాయా?
- బాబ్రీ మసీదు నిర్మాణానికి ముందు, ఇక్కడ హిందువులు పూజలు చేసే వారనడానికి ఆధారం వుందా?
- ఇప్పుడు ఆ స్థలంలో వున్న రాముడు, సీత విగ్రహాలు 1949లో దౌర్జన్యంగా ప్రతిష్ఠించినవా లేక అంతకుముందే అక్కడ వున్నాయా?
- బాబ్రీ మసీదుకట్టడానికి మినార్‌లు లేవు కాబట్టి, దాన్ని మసీదు అని పిలవవచ్చా?
- దీని చుట్టూ మూడు ప్రక్కలా ముస్లిం సమాధులున్నాయి కాబట్టి, దీనికి మసీదు పవిత్రత వుంటుందా?
- ఇస్లాం మత సూత్రాల ప్రకారం, హిందు విగ్రహాలు వున్నచోట మసీదు నిర్మాణం జరపవచ్చా?
- బాబ్రీ మసీదు కూల్చి వేత జరిగిపోయింది కాబట్టి, దాన్ని ఇంకా మసీదు అని పిలవడం సమంజసమా?
- కూల్చి వేత జరిగిన ఖాళీ ప్రదేశంలో ముస్లింలు నమాజు చేసుకోవచ్చా?
- బాబ్రీ మసీదు కూల్చివేత సమయంలో అక్కడ రాముడు, సీత విగ్రహాలు ప్రతిష్ఠించిన అరుగు కూడా కూలిపోయిందా?

## శత్రుత్రయం ఇదీ...

### టీవీ ఛానళ్లు, పాకిస్తాన్ చైనాలు , తీవ్రవాదులు

అయోధ్య వివాదంలో కోర్టు తీర్పు తర్వాత కలిగే అనర్థాలకు ప్రేరకులు, కారకులు ప్రధానంగా పైన చెప్పిన మూడు శక్తులే. ఇటువంటి ఉత్పాతాలను తమ ప్రయోజనాలకు అనుగుణంగా మలచుకోవడంలో ఈ మూడు శక్తులదీ ఒకే తీరు. 1992లో బాబ్రీ మసీదు కూలగొట్టే సమయంలో దేశంలో న్యూస్ టీవీ ఛానళ్లు లేవు. కానీ ఇప్పుడు వూరికొక ఛానల్ వుంది. ఒక ఛానల్‌కు మరొక ఛానల్‌కు వ్యాపారపరమైన పోటీ వుంది. నూటికి తొంభై తొమ్మిది శాతం టీవీ విలేఖరులకు కనీసపాటి పాత్రికేయ ప్రమాణాల పట్ల అవగాహన లేదు. శిక్షణ లేదు. వారికి తెలిసిందల్లా ఏదో ఒక అభూత కల్పనతో తమ టీవీ ఛానల్ పట్ల వీక్షకులను ఆకర్షించడం మాత్రమే. అందుకోసం ఎంతకైనా తెగిస్తారు. ఇక్కడ బాంబు పేలింది, అక్కడ ప్రార్థనా మందిరం కూలింది అని తప్పుడు వార్తలు ప్రచారం చేస్తారు. లేనిపోని పుకార్లతో గందరగోళం సృష్టిస్తారు. టీవీ న్యూస్ ఛానళ్ల నుంచి దేశాన్ని రక్షించుకోవడం, మత కలహాలు పెచ్చరిల్లకుండా చూసుకోవడం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు పెద్ద సవాలు క్రిందే లెక్క. మత కలహాల వంటి సున్నితమైన అంశాలలో అభూత కల్పనలు, అపోహలు, అపార్థాలు ప్రచారం చేసే టీవీ ఛానల్ యాజమాన్యాలను కఠినంగా శిక్షించే చట్టాలు చేస్తే తప్ప ఈ మహమ్మారి బారి నుంచి ప్రజలను కాపాడలేరు.

పాకిస్తాన్ సంగతి తెలిసిందే. వారికిప్పుడు చైనా తోడై వుంది. భారతదేశంలో ఎక్కడ ఏ చిన్న నిప్పు పుట్టినా, దాన్ని దావానం వలె వ్యాపింప చేయడానికి కాచుకొని వుంటారు వారు. బాబ్రీ మసీదు వివాదం అంటే వారికి ఎనలేని మక్కువ. తీవ్రవాద సంస్థలదీ అదే దారి. తీవ్రవాదం అంటే ఒక్క ముస్లిమే కాదు, వారిని మించిన హిందూ మతోన్మాదులు కూడా ప్రజల మధ్య అశాంతిని ప్రేరేపించడానికి పొంచి వున్నారు. వీరిని కట్టడి చేయగలిగితేనే ఇటువంటి వివాదాల నుంచి ప్రజలను కాపాడగలుగుతారు.




చేతికందిందంతా పూర్తిగా ఖర్చు చేస్తారు. ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకొని ఇబ్బందులు కొని తెచ్చుకోవద్దు. కళత్ర సంబంధం కొంతవరకు మెరుగు. వాహనాలు నడిపే సమయంలో అతిజాగ్రత్త అవసరం. ఆర్థికవ్యవహారాల్లో తొందరపాటు వల్ల నష్టపోతారు. నిర్విఘ్నంగా పనులు జరగడానికి దైవప్రార్థన చేయండి. బంధువుల కారణంగా చికాకు ఉండవచ్చు.




పిల్లల కోసం విలువైన వస్తువులు కొంటారు. సమాజంలో గౌరవమర్యాదలు పెరుగుతాయి. మృదుభాషణతో పనులు సాధించుకొంటారు. సంతానమూలంగా లాభాలు. శుభవార్తాశ్రవణం. ఉద్యోగంలో నూతన బాధ్యతలు అధికమై విసుగు తెప్పిస్తాయి. గృహిణులకు బంధువుల రాక విశ్రాంతి రాహిత్యాన్నిస్తుంది. గృహోపకరణాలుకొని సౌకర్యాలు పెంచుకొంటారు




ఆరోగ్యవిషయాలు చక్కగా ఉంటాయి. ఆప్తమిత్రుల తోడ్పాటు లభిస్తుంది. సమాజంలో గౌరవ మర్యాదలు ఇనుమడిస్తాయి. ఎన్ని నాళ్ళుగానో ఎదురుచూసిన ప్రియవార్తాశ్రవణం చేస్తారు. ఇరుగు పొరుగువారితో సంబంధాలు చక్కగా ఉంటాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు కొంతవరకు తొలగుతాయి. ఆదాయమున్నా ఖర్చులు అధికం. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు.




వ్యాపారులకు భాగస్వాముల మూలంగా మంచి లాభప్రాప్తి ఉంటుంది. వృత్తిపరులు తమ మూర్ఖతవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. మాతృసుఖం లభిస్తుంది. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు ఒక మోస్తరుగా ఊపందుకొంటాయి. గృహసంబంధమైన వస్తువులు కొంటారు. కళత్ర సుఖం బాగుంటుంది. వ్రతాలు, పూజలు మొదలైన వాటిలో పాల్గొంటారు.




అనుకొన్నవన్నీ సాధించుకొంటారు. కుటుంబసభ్యుల అవసరాలను గుర్తించి వారికి అందేట్లు చేస్తారు. బ్యాంకు నిల్వలు పెంచే పథకాలు తయారు చేస్తారు. వృత్తిరీత్యా మంచి అభివృద్ధి ఉంటుంది. సంతానమూలంగా తృప్తి లభిస్తుంది. బంధుమిత్రులను, గురుతుల్యులను కలుసుకొంటారు. శుభకార్యాలలో మీ పాత్ర చక్కగా నిర్వహిస్తారు. ఆదాయం తృప్తికరంగా ఉంటుంది.




ఆర్థికవిషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. కొత్త ఆలోచనలు తోస్తాయి. పూనుకొన్న పనుల్ని పూర్తిచేయడంలో కొంత శ్రమ ఎదుర్కోవలసి వస్తుంది. బంధుమిత్రులలో కొందరు ధనసహాయం కోరివస్తారు. తొందరపాటు వద్దు. వ్యాపారులు పెట్టుబడులపై ముఖ్య నిర్ణయం తీసుకొంటారు. ఉద్యోగులకు పైఅధికారుల వైఖరివల్ల మనశ్శాంతి కొరవడుతుంది.

# వారఫలాలు

*తేది 25-09-2010 నుండి 1-10-2010 వరకు కన్యలో రవి, శనులు; సింహ, కన్యలలో బుధుడు; మీనంలో గురువు; తులలో శుక్ర, కుజులు; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; మీన, మేష, వృషభాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

### శుభ ముహూర్తాలు

1తేది వృషభలగ్నాన రా.11.00 నుంచి 12.00 గంటల వరకు

కర్కాటక లగ్నాన తె.2.30 నుండి 3.30 వరకు సుముహూర్తాలున్నాయి.

### సెప్టెంబర్ తిథులు

**భాద్రపద బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 25 | శని | విదియ | సా.6.31 | గం.ల.వ |
| 26 | ఆది | తదియ | రా.8.00 | గం.ల.వ |
| 27 | సోమ | చవితి | రా.9.08 | గం.ల.వ |
| 28 | మంగళ | పంచమి | రా.9.50 | గం.ల.వ |
| 29 | బుధ | షష్ఠి | రా.10.02 | గం.ల.వ |
| 30 | గురు | సప్తమి | రా.9.39 | గం.ల.వ |
| 1 | శుక్ర | అష్టమి | రా.8.40 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




నూతన వ్యక్తుల పరిచయాలు ఏర్పడతాయి. జనసంబంధాలు మెరుగుపడతాయి. ప్రయాణాలు, చర్చల విషయంలో కొంత మెలకువగా ఉండాలి. పితృసంబంధీకుల నుండి మంచి వార్త వింటారు. ధనవిషయాలలో లోటులేదు. వివిధమార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. శుభకార్యాచరణకు శ్రీకారం చుడతారు.




ఆహార విషయంలో శ్రద్ధలేకుంటే అనారోగ్యపరిస్థితులు ఆందోళన నిస్తాయి. ఎదురుచూసిన వారిని కలుసుకొంటారు. ఊహించని ప్రయాణాలు ఇబ్బందికరమవుతాయి. ముక్కుసూటిగా పోవడం, అసహనం, కోపావేశాలు మానుకోవాలి. ప్రతిపనిలో నిదానం అవసరం. అప్పుడే మనశ్శాంతి లభిస్తుంది. ఆంత్ర బాధలుండవచ్చు. ధనవిషయంలో లోటుండదు.




వృత్తి ఉద్యోగాల్లో పురోభివృద్ధి కానవస్తుంది. ధనాదాయం తృప్తికరం. ఆత్మీయులు మిక్కిలిగా ప్రోత్సాహమిస్తారు. సమాజంలో పరపతి పెరుగుతుంది. బంధువుల నడుమ మన్ననల ప్రాప్తికి అవకాశాలు. సంతానానికి సంబంధించిన విషయాల్లో అతిశ్రద్ధ, ముఖ్యమైన నిర్ణయాలు తీసుకొంటారు. దైవపూజా కార్యక్రమాలలో పాలుపంచుకొంటారు. బంధుమిత్రుల మూలంగా కష్టనష్టాలెక్కువ.




పొత్తికడుపుకు సంబంధించి ఇబ్బంది ఉండవచ్చు. దూర ప్రయాణాలు మానుకోవాలి. కళత్రఆరోగ్యం జాగ్రత్త. వృత్తిలో మార్పు చేర్పులు. దైవకార్యాలలో పాలుపంచుకోవడం మంచిది. దూరవార్తాశ్రవణం ప్రయోజనకారి. వ్యాపారులకు కొంతవరకు మేలు. ఊహలు తారుమారు అవుతాయి. అనుకొన్నవి జరుగక పోవచ్చు. మోసపోయే అవకాశాలున్నాయి జాగ్రత్త.




దైవచింతనలో మనసు పోనివ్వాలి. ప్రతిపని దీర్ఘంగా ఆలోచించి చేయాలి. నష్టావకాశాలు. అనవసరపు ఖర్చులు. ముందుచూపు అవసరం. అనారోగ్య బాధలుంటాయి. సమ సమాజంలో గౌరవం, మన్నన, మర్యాదలు పెరుగుతాయి. తోటివారు మనస్ఫూర్తిగా మీ పనులలో సాయమందిస్తారు. సంతానానికి సంబంధించిన విషయాల్లో అతిశ్రద్ధతో ముఖ్యమైన నిర్ణయాలు తీసుకొంటారు.




వారసత్వ ఆస్తులకు సంబంధించిన ఇబ్బందులు తొలగుతాయి. భవిష్యదాయాలను ఊహించి ఖర్చులు చేస్తారు. అభిప్రాయభేదాలు తొలగి కళత్ర సంబంధాలు మెరుగుపడతాయి. వృత్తిలో మార్పు చేర్పులు. ఆర్థికలావాదేవీలు సరియైన రీతిలో నిర్వహిస్తారు. దైవకార్యాలలో పాలుపంచుకోవడం మంచిది. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు.

# ఇంటికి ఏ ప్రక్క దేవాలయం వున్నా ఇబ్బందులే!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.వి.రాజేశ్వర్‌గౌడ్ — నెల్లూరు*

** ఇంటికెదురుగా దేవాలయమున్నది. చుట్టు ప్రక్కల గృహాల్లో కూడా యజమానులెవరూ లేరు.*

ఇంటికి ఎదురుగాని, పృష్ఠ, పార్శ్వ, ముఖ, వెన్ను ఏ భాగంలో దేవాలయమున్నా యజమానులు గృహాల్ని వీడుతారు. లేదా ఆరోగ్య, ఆర్థిక భంగం కలుగుతుంది.

*ఎం.ఆర్.రాధికరెడ్డి — కర్నూలు*

** ఉత్తరం యింటికి వాయువ్య ద్వారాలున్నాయి.*

వాయువ్యం నీచస్థానం. వెంటనే ద్వారాన్ని ఈశాన్యానికి మార్చండి. లెట్రిన్ బేస్‌లన్నీ ఉత్తరం వైపుకి మార్చండి. రత్నాల్లో స్థాయిని బట్టి ధరలుంటాయి.

*రాజిరెడ్డి కాత్యాయిని — ఒంగోలు*

** దక్షిణం ప్రహరీ లేదు. పశ్చిమం ప్రహరీ పెరిగింది.*

స్త్రీ, పురుషుల మధ్య 'ఐక్యత' ఉండదు. ఆర్థికం ఎంతకూడినా 'జారి'పోతూనే వుంటుంది.

*విమలనాయుడు — చెన్నై*

** అర్థం కాని సమస్యలతో సతమతమవుతున్నప్పుడు చెన్నైలోని మా మిత్రుడు యంత్ర ప్రతిష్ట చేశాక సమస్యలు పారిపోయాయి.*

'నరఘోష' యంత్రానికి మాత్రమే అటువంటి ప్రభావం వుంటుంది. అయినప్పటికీ వాస్తు దోషాల్ని మూడు మాసాలలోగా సవరించుకోవాలి.

*తిరువీధి శోభనరావు — విజయవాడ*

** శుక్ర రాశికి తప్పనిసరి డైమండ్ వాడాలా?*

శుక్రుడు అధిపతి అయినపుడు ఆర్థికస్థితి బాగోలేని వాళ్లు 'బాంబే డైమండ్' కూడా వాడవచ్చు. అయితే మీరు చెప్పిన విధానం సరికాదు. తప్పనిసరిగా వాస్తు దోషాలు సవరించుకోవాలి.

*పి.వి.అనంతరావు — గూడూరు*

** మనిషికిన్ని సమస్యలుంటాయా? బ్రతికి ఏం సాధించాలి?*

చనిపోయి సాధించేదేమీ ఉండదు గనుక, బ్రతికే సాధించాలి. మీరు కనక పుష్యరాగం ధరించండి. అన్నీ సర్దుకుంటాయి.

*అరిగెల శకుంతల — నెల్లూరు*

** పశ్చిమం సమాంతరంగాను, తూర్పు కోణాకారంలోనూ వున్న స్థలంలో నిర్మాణం చేయవచ్చా?*

విల్లు లేదా 'డి' ఆకారపు స్థలంలో నిర్మాణం మరణ సదృశ్యం. నిర్మాణం పూర్తికాగానే యజమాని వ్యాధిగ్రస్తుడై మరణిస్తాడు.

*మహమ్మద్ నసీనాబేగం — నెల్లూరు*

** కోలుకుంటారు మళ్లీ మంచమెక్కుతారు. ఏమీ అర్థం కావడం లేదు.*

జాతకం, ప్లాను బేరీజు వేశాక 'శని' ప్రవేశం జరిగిందని భావన. కుడి ఉంగరపు వ్రేలికి నీలం (ఉచ్ఛ) ధరింపజేయండి. వ్యాధులు నిమ్మళిస్తాయి.

*పి.సాయినాథ్ — నెల్లూరు*

** లేఅవుట్ల లోపాలు ఆ ప్రాంతాల గృహాలపై ఉంటుందా?*

మీరు చెప్పిన పరిస్థితుల ప్రభావాలు నెల్లూరులోని స్పిన్నింగ్ మిల్, మాగుంట లేఅవుట్, సిసి లేఅవుట్‌లలో ఎక్కువగా కనిపిస్తాయి. ఇక్కడవన్నీ ఆకస్మిక ప్రభావాలే!

*చిట్టెడ సదానంద — చీరాల*

** స్థలం సరిచేసుకొన్నాక పాత ప్రహరీలు తీసేయాలా? చెట్లు వేసుకుంటే సరిపోతుందా?*

కొత్త ప్రహరీలతో స్థలాన్ని సరిచేసుకున్నాక, పాత ప్రహరీలు బేస్‌మెంటుతో సహా తీసివేయాలి.

*షేక్ సులేఖాబేగం — సికింద్రాబాద్*

** నైరుతి వంట గది, ఈశాన్యం బెడ్‌రూం. కామెంట్ ప్లీజ్!*

నైరుతి గదిలో ఆగ్నేయంలో వంట, ఈశాన్యం గదిలో, దక్షిణ, పశ్చిమాలలో పడక మీరూహించినంత ఉపద్రవాలేమీ కలుగవు. అయితే నలభై శాతం ప్రభావాలెట్లాగూ వుంటాయి.

# ఐటిడిఏ పిఓ రమేష్ పాపం పండింది!

సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ (ఐటిడిఏ) ప్రాజెక్టు అధికారి కామంచి రమేష్ పాపం పండింది. గత రెండు సంవత్సరాల నుంచి ఐటిడిఏలో జరిగిన నిధుల దుర్వినియోగం, అవినీతి, అక్రమాలు ఒక్కసారిగా బయటపడ్డాయి. దీంతో రాష్ట్రప్రభుత్వం రమేష్‌ను బదలీ చేసేందుకు నిర్ణయించింది. వ్యవసాయ పరిశోధన కేంద్రానికి చెందిన రమేష్ రెండు సంవత్సరాల క్రితం నెల్లూరు ఐటిడిఏ ప్రాజెక్టు అధికారిగా నియమించబడ్డాడు. ఇందుకు జిల్లా నుంచి రాష్ట్ర రాజధాని వరకు అనేక పైరవీలు చేయించాడు.

జిల్లా కలెక్టర్ ద్వారా తన పేరును ప్రతిపాదించుకోవడంతోపాటు ఎమ్మెల్యేలు, ఎమ్పీల ద్వారా కూడా సిఫార్సు చేయించుకొన్నాడు. ఇంతమంది రమేష్‌కు మద్దతు తెలపడంతో రాష్ట్రప్రభుత్వం పిఓగా రమేష్‌ను నియమిస్తూ ఆదేశాలిచ్చింది. ఆదేశాలందుకుని పి.ఓ కుర్చీలో కూర్చొన్న ఈయన ఆ రోజు నుంచి ఇప్పటివరకు చక్రం తిప్పాడు. ఉన్నతాధికారులు రాజకీయ నేతలతో పెద్దగా సంబంధాలు ఏర్పరచుకోరు. అధికారిక సమావేశాల్లో మాత్రమే ప్రజాప్రతినిధుల్ని పలకరించి వెళ్తుంటారు.

అయితే ఈ పి.ఓ మాత్రం నిత్యం రాజకీయ నేతలతో, ఎమ్మెల్యేల అతిధిగృహాల్లో సేవలందిస్తుంటాడు. ఒక అధికారిగా కాకుండా సేవకుడిగా వారికి కావాల్సిన అన్ని పనులు చేస్తుంటాడు. ఇలా చేయడం వలన ఎమ్మెల్యేలు, ఎమ్పీలు రమేష్ చేసే అవినీతి, అక్రమాలను చూసీ చూడనట్లుగా వదిలేస్తుంటారు. ఉదయగిరి మండలానికి చెందిన జడ్పీటీసి రమణమ్మను అవమానకరంగా మాట్లాడడం, మండల పరిషత్ కార్యాలయ ఉద్యోగిని అతిధి గృహానికి రమ్మని పిలవడం వంటి ఆరోపణలు ఎదుర్కొన్నాడు.

**రమేష్ అవినీతిపరుడని ప్రభుత్వ విచారణలో తేలినా అతన్ని రక్షించేందుకు నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, ఉదయగిరి ఎమ్మెల్యే చంద్రశేఖర్‌రెడ్డి చేసిన ప్రయత్నాలు విస్మయపరిచాయి.**

జిల్లాపరిషత్ సర్వసభ్య సమావేశంలో జడ్పీటీసి రమణమ్మ పి.ఓ రమేష్‌పై తగినచర్యలు తీసుకోవాలని గట్టిగా పట్టుపట్టడంతో వేరే మండలానికి స్పెషలాఫీసర్‌గా బదలీ చేస్తున్నట్లు కలెక్టర్ ప్రకటించారు. ఎందువల్లనోకాని ఇంతకు మించి రమేష్‌పై ఎటువంటి చర్యలు తీసుకోలేకపోయారు. గిరిజనులకు చెందాల్సిన కోట్లాదిరూపాయల నిధులను వివిధ కార్యక్రమాల నిర్వహణ పేరుతో స్వాహా చేసినట్లు ఇటీవల నిర్వహించిన ఆడిట్‌లో గుర్తించారు.

గిరిజన సంక్షేమశాఖ హాస్టళ్ల పనితీరును పర్యవేక్షించేందుకు జిల్లాస్థాయి అధికారిని ప్రభుత్వం నియమించినప్పటికి నెలసరి మామూళ్లు ఎక్కడ చేజారిపోతాయోనని హాస్టళ్లపై పెత్తనం ఈయనే చేసేవాడు. ఐటిడిఏ, గిరిజన సంక్షేమశాఖలో తనకు వ్యతిరేకంగా వ్యవహరించే వారిపై అనుచరుల చేత పిటిషన్లు పెట్టించి ఇబ్బంది పెట్టేవాడు. పిటిషన్లపై విచారణ చేయమని ప్రభుత్వం నుంచి ఆదేశాలు వచ్చాయని బెదిరించి కార్యాలయ ఉద్యోగులు, వార్డెన్ల నుంచి వేలాది రూపాయలు గుంజేవాడు.

పి.ఓగా నియామకం జరిగిన నాటి నుంచి అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాల కోసం ప్రభుత్వం విడుదల చేసిన నిధులు ప్రక్కదారి పట్టినట్లు అనేక ఫిర్యాదులు వెళ్లడంతో ప్రభుత్వం స్పందించక తప్పలేదు. నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, ఎమ్మెల్యే చంద్రశేఖర్‌రెడ్డి రమేష్‌పై చర్యలు తీసుకోకుండా గిరిజన సంక్షేమశాఖ కమిషనర్‌ను కోరినట్లు తెలిసింది.


పిఓ రమేష్ బదలీకి సర్వం సిద్ధం.

అయినప్పటికీ ఫిర్యాదులు అధికంగా వుండడం వలన చర్యలు తీసుకునేందుకే ప్రభుత్వం నిర్ణయించింది. పి.ఓ బాధ్యతల నుంచి తప్పించి ఆయన మాతృసంస్థకు పంపే అవకాశం వుంది. మొత్తం మీద రమేష్‌పై ప్రభుత్వం చర్యలు తీసుకునేందుకు నిర్ణయించడంపై గిరిజన సంఘాల ప్రతినిధులు సంతోషం వ్యక్తం చేస్తున్నారు.



అవినీతి కథ

# కెఎసి ప్లాజాపై మరో రెండంతస్థులకు యత్నం!

**నెల్లూరు నగర నడిబొడ్డులో 1995లో నిర్మించిన కెఏసి ప్లాజాకు కార్పొరేషన్ అనుమతి లేదు. తూతూమంత్రంగా కట్టిన ఈ షాపింగ్ కాంప్లెక్స్‌పై రూరల్ ఎమ్మెల్యే పేరు చెప్పి ముప్పసాని శ్రీనివాసులు మరో రెండంతస్థుల అక్రమ నిర్మాణానికి శ్రీకారం చుట్టిన తీరు అందర్నీ ఆశ్చర్యపరచింది.**

అధికారుల వుదాసీనత, రాజకీయ నేతల అండదండలతో నెల్లూరు నగరంలో అక్రమ నిర్మాణాలు జోరుగా సాగుతున్నాయి. భవన నిర్మాణాలు చేపట్టే వారికి ఎటువంటి స్థలం లేకున్నా, ఇతరులకు సంబంధించిన ఖాళీస్థలాలు, ప్రభుత్వానికి సంబంధించిన ఖాళీస్థలాల్లో నిర్మాణాలు చేపట్టేస్తున్నారు. ఖాళీగా కనిపించే స్థలాల్ని సైతం అక్రమించడంతోపాటు నిర్మాణాలు చేపడుతుండడంతో బాధితులు ఏంచేయాలో దిక్కుతోచని స్థితిలో వున్నారు.

అధికార పార్టీకి చెందిన నేతల సహకారం వుంటే ఏ ప్రాంతంలోనైనా భవన నిర్మాణం చేపట్టవచ్చని నిరూపిస్తున్నారు. తాజాగా నగరం నడిబొడ్డున వున్న కెఏసి ప్లాజాలో మరో అక్రమ నిర్మాణం చోటు చేసుకొంది. 1995వ సంవత్సరంలో గాదంశెట్టి గోపాల్ అనే బిల్డర్ కెఏసి ప్లాజా నిర్మాణం చేపట్టారు. ఇక్కడ దాదాపు వందకు పైగా షాపులు నిర్మించి వ్యాపారాల నిమిత్తం అద్దెకు ఇవ్వడం జరిగింది. తర్వాత షాపుల్ని అద్దెకున్న వారికే విక్రయించేశాడు.

షాపుల్ని విక్రయించే సమయంలో అన్ని అనుమతులు వున్నాయని నమ్మబలికి విక్రయం జరిపాడు. తర్వాత కొనుగోలు చేసిన వ్యాపారులు పరిశీలన జరిపితే మునిసిపల్ కార్పొరేషన్ అనుమతి లేదని బయటపడింది. దీంతో కొందరు రెగ్యులరైజ్ చేయించుకోవడం జరిగింది. అయితే ఇటీవల ముప్పసాని శ్రీనివాసులు, ఉద్దండి శ్రీనివాస్ అనే వ్యక్తులు కెఏసి ప్లాజా మూడవ అంతస్తుపై షాపుల్ని నిర్మించేందుకు రంగం సిద్ధం చేసుకున్నారు. ఇందులో భాగంగా సిమెంటు పిల్లర్లను ఏర్పాటు చేయడం జరిగింది.

కొందరు షాపు యజమానులు పై అంతస్తుపై చేపట్టే నిర్మాణంపై అభ్యంతరం వ్యక్తం చేయగా వీరు లెక్క చేయలేదు. కెఏసి ప్లాజాలో వున్న షాపు యజమానుల మధ్య సమన్వయం లేకపోవడం అక్రమ నిర్మాణం చేపట్టేవారికి బాగా కలిసి వచ్చింది. అధికారపార్టీకి చెందిన నేతల అండదండలు వున్నాయని చెప్పి కొందరిని ఇప్పటికే భయపెట్టారు. పై అంతస్తుపై నిర్మాణం చేపట్టి ఇరువురికి ఎటువంటి సంబంధం లేకపోయినా దౌర్జన్యపూరితంగా వ్యవహరిస్తున్నారు.

నిర్మాణం చేపట్టే వారిలో ఒకరైన ముప్పసాని శ్రీనివాసులు గతంలో మునిసిపల్ కార్పొరేటర్‌గా కాంగ్రెస్ పార్టీ తరపున పోటీ చేసి ఓడిపోయాడు. ఆనం సోదరులు నిర్వహించే కార్యక్రమాలలో పాల్గొంటూ వారి సహకారంతో మునిసిపల్ కార్పొరేషన్‌లో చిన్న చిన్న కాంట్రాక్టు పనులు చేస్తుంటాడు. ఈ క్రమంలో కెఏసి ప్లాజాపై కన్నుపడింది. పై అంతస్తులో షాపులు నిర్మించి అద్దెకిస్తే లక్షలాది రూపాయలు సంపాదించవచ్చన్న ఆశతో ఇతరులను కలుపుకుని నిర్మాణం చేపట్టాడు.


నెల్లూరు కెఏసి ప్లాజాలో అక్రమ కట్టడానికి యత్నం.

కెఏసి ప్లాజా పైఅంతస్తులో నిర్మిస్తున్న అక్రమ నిర్మాణంపై మునిసిపల్ కమిషనర్ ఆంజనేయులు సమాచారం అందిస్తే రెండురోజుల వరకు స్పందించలేకపోయారు. బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్లకు ఈ విషయం తెలిసినా కూడా ఇందులో రాజకీయ జోక్యం వుండడంతో ఆవైపు కన్నెత్తి కూడా చూడలేకపోయారు. షాపు యజమానులు మీడియా ప్రతినిధులకు సమాచారం అందించడంతో కార్పొరేషన్ అధికారులు కదలక తప్పలేదు. మూడవరోజు బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్ సిబ్బందిని తీసుకొచ్చి సిమెంటు పిల్లర్లను పగులగొట్టించారు.

ఈ భవనంపై మరో రెండస్థులు నిర్మిస్తే భవిష్యత్‌లో ఏదైనా ప్రమాదం సంభవిస్తే జరిగే నష్టాన్ని అంచనా వేయడం కష్టతరం. కార్పొరేషన్ అధికారులు తిరిగి భవన నిర్మాణానికి అనుమతి ఇచ్చే అవకాశం వుందని షాపు యజమానులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.





# జ్ఞాపకాల్లో జియా!

నిశ్శబ్ద్ చిత్రంలో ఏకంగా అమితాబ్ సరసన నటించి వార్తల్లో వెలిగింది వర్ధమాన హీరోయిన్ జియాఖాన్. రెండు మూడు చిత్రాల తర్వాత ఆమెకు అవకాశాలు లేకుండా పోయాయి. అందుకే తన పాతజ్ఞాపకాలను నెమరేస్తోంది. అమీర్‌ఖాన్‌తో గజిని చిత్రం చేయడం నాకు మరచిపోలేని అనుభూతి. ఆయన శైలి ప్రత్యేకం. ఇక అక్షయ్‌కుమార్‌తో కలిసి చేసిన 'హౌస్‌ఫుల్' నాకు మంచి పేరే తీసుకొచ్చింది. సెట్‌లోని సభ్యులతో ఆయన కలివిడిగా వుంటారు. అమితాబ్, అమీర్‌ఖాన్, అక్షయకుమార్‌లతో పనిచేయడం కాలేజికి వెళ్లి నటనలో పాఠాలు నేర్చుకొన్నట్లుందని చెప్పుకొచ్చింది జియా.

# సంతోషంగా వుంది!



గాయం-2 చిత్రం విజయవంతమవడంతో హీరో జగపతిబాబులో ఆనందం వెల్లివిరిసింది. ఈ విషయాన్ని ఆయన వివరిస్తూ నిజం చెప్పాలంటే గాయం కంటే గాయం-2 కోసం బాగా కష్టపడ్డాను. ఎనిమిది నెలలపాటు ఇంకో సినిమా ఒప్పుకోలేదు. ఒక విధంగా చెప్పాలంటే ఇది నా డ్రీమ్ రోల్. గాయంకు సీక్వెల్ తీస్తున్నామని వర్మను సలహా అడిగినప్పుడు ఆయన వద్దన్నారు. కాని ఈ చిత్ర దర్శకుడు ప్రవీణ్ శ్రీ చెప్పిన కథ విని వర్మ తన అభిప్రాయం మార్చుకొన్నారు. కొన్ని మార్పులు చేర్పులు చేశారు. పక్కా స్క్రిప్ట్‌తో సినిమాను తెరకెక్కించాం. అందుకే సినిమా అంత బాగా వచ్చిందన్నారు.

# ప్రియుడు మారాడు



బాలీవుడ్‌లో మంచి క్రేజ్ తెచ్చుకున్న జంట రణబీర్‌కపూర్, దీపికా పదుకొనేల మధ్య ప్రేమ క్షణాల్లో పుట్టింది. ఎంత వేగంగా ఒక్కట య్యారో, అంతే వేగంగా విడిపోయారు. రణబీర్‌ను పిచ్చిగా ప్రేమించిన దీపికా ఒంటిపై ఆర్‌కె అని పచ్చ బొట్టు వేయించుకొంది. చాక్లెట్ బాయ్ ఇమేజ్ సంపాదించిన రణబీర్‌కు అమ్మాయిల తాకిడి ఎక్కువ. ఎప్పటికప్పుడు కొత్త అందాలను చూసే రణబీర్ దీపికాను వద్దనుకొన్నాడు. దీపికా కూడా ఒంటరి జీవితాన్ని గడపలేకపోయింది. కొత్త ప్రియుడిని ఎంచుకొంది. లిక్కర్‌కింగ్ విజయ్‌మాల్యా తనయుడు సిద్దార్థమాల్యాకు దగ్గరయ్యింది. వీరిద్దరూ ఒకర్నొకరు గాఢంగా ప్రేమించుకొంటున్నారని బాలీవుడ్‌లో పుకార్లు షికారు చేస్తున్నాయి.



# ప్రియమణి ఆశ!

హీరోయిన్ ప్రియమణి రక్తచరిత్ర సినిమా మీద చాలా ఆశలే పెట్టుకొంది. ఈ సినిమాతోనైనా బాలీవుడ్‌లో తన జాతకం మారుతోందని నమ్ముతోంది. రావణ్ హిందీ చిత్రంలో ప్రియమణి నటించినా ఆ చిత్రం ఆడకపోవడంతో ఆమెకు గుర్తింపురాలేదు. రక్తచరిత్రతో సూర్య భార్యగా తన పాత్రను రామ్‌గోపాల్‌వర్మ బాగా తీర్చిదిద్దాడని హిందీలో కూడా తానే తన పాత్రకు డబ్బింగ్ చెప్పుకొన్నానంటుంది. బాలీవుడ్‌లో అవకాశాలు వస్తే చెన్నై, హైదరాబాద్ నుంచి వెళ్లి వస్తానని ముంబాయి వెళ్లి మాత్రం స్థిరపడనంది.



# సైఫ్‌ను పొగిడిన కరీనా!

జీరో సైజ్ అందాల భామ కరీనాకపూర్ కెరీర్ ప్రకటనలు, సినిమాలతో సాఫీగా సాగుతుంది. నటిగా నిరూపించుకొనే పాత్రలు, ఛమేలీ, ఓంకార, జబ్ ఉయ్‌మెట్, త్రీ ఇడియట్స్, ఖుర్బానీ చిత్రాల్లో నటించబట్టే తనకు పేరు ప్రఖ్యాతులు వచ్చాయంటుంది. సైఫ్ అలీఖాన్ లాంటి మంచి వ్యక్తి ప్రేమికునిగా దొరకడం తన అదృష్టమంటుంది. చాలా కొద్ది మందికి మాత్రమే స్వచ్ఛమైన ప్రేమ దొరుకుతుంది. అది సైఫ్ నుంచి నాకు ఎప్పుడో లభించింది. నిండైన వ్యక్తిత్వం అతనిది. ఎవరి జోలికి వెళ్లడు. తనదైన ప్రపంచంలో గడుపుతుంటాడని ప్రశంసించింది.

# సరదాగా కాసేపు... చూడొచ్చు!



✍ అల్లూరు రహీం

సినీ దర్శకుడు వంశీ బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆయన సినీ పరిశ్రమకు రాకమునుపే మంచి రచయితగా పేరుగాంచారు. ఆయన తీసిన సినిమాల్లో సితార, ప్రేమించు - పెళ్లాడు, అన్వేషణ, లేడీస్‌టైలర్ జనాన్ని బాగా మెప్పించాయి. చాలా గ్యాప్ తీసుకొని గత ఏడాది గోపి గోపిక గోదావరి చిత్రాన్ని తీశారు. తాజాగా ఆయన శ్రీకీర్తి కంబైన్స్ పతాకంపై తీసిన సరదాగా కాసేపు చిత్రం పేరుకు తగ్గట్లే వుంది. మంచి వినోదం, సంగీతం, సాహిత్యం, గోదావరి అందాలు వీటికితోడుగా హీరోయిన్ అందాల ప్రదర్శనతో సాగిపోతుంది. వంశీ మార్కు పాత్రలు, స్వాచి కామెడీ డైలాగులు ప్రేక్షకులను అలరిస్తాయి. ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించడంతోపాటు వంశీ రెండు పాటలు కూడా పాడారు. అవి వెరైటీగా వున్నాయి. వంశీ ప్రభావం వల్ల కాబోలు సంగీత దర్శకుడు చక్రి ఈ చిత్రానికి ఇళయరాజా బాణీలో సంగీతమందించాడు. ఆ బాణీలో సాగే మగధీర... సుకుమార, నీ పలుకులు, ఊహల్లో, మల్లెనవ్వు... మురిపాల నవ్వు పాటలు బాగున్నాయి. వీటన్నింటినీ కొత్త రచయిత ప్రవీణ్ వ్రాశాడు. మరో కొత్త రచయిత పడాల వ్రాసిన మాటల్లో హాస్యపుపాలు ఎక్కువగా కనపడింది. బుర్రా... మర్రిచెట్టు తొర్ర. టీతో కాదు పెట్రోల్‌తో స్టార్ట్ అవుతుంది. ఉషలేదు త్రిష లేదు. రెస్ట్ లేదు బూస్ట్ వుంది డైలాగులు ఆ కోవలోనివే. హీరోయిన్ మధురిమ కాస్త బొద్దుగా వున్నా పాటల చిత్రీకరణకు ఆమె కళ్లు... నడుము, అధరాలు బాగా సహకరించాయి. సందీప్ కెమెరా గోదావరి అందాలను తనదైన బాణీలో చిత్రీకరించుకొంటూ పోయింది.

ఇక చిత్రకథలోనికి వెళ్తే గోదావరి జిల్లాలోని పాసర్లపూడి గ్రామంలో మోతుబరి జీవా, సనల కుమారుడు శ్రీనివాస్ (అవసరాల శ్రీనివాస్) అమెరికా నుంచి చదువు ముగించుకొని వస్తాడు. వీరింట్లో డ్రైవర్ రంగబాబు(నరేష్). హైదరాబాద్‌లో బిస్కెట్ల కంపెనీ యజమాని రాజారావు(ఆహూతి ప్రసాద్) చంద్రకళ(జయలలిత)ల కుమార్తె మణిమాల(మధురిమ)ను శ్రీనివాస్‌కు ఇచ్చి పెళ్లి చేయాలని పెద్దలు నిశ్చయిస్తారు. అయితే కొన్నాళ్లు మణిమాలను దగ్గర నుంచి గమనించి పెళ్లి చేసుకొంటానంటాడు శ్రీనివాస్. జీవా రాజారావుకు ఈ విషయం ఫోన్‌లో చెప్పి తన కుమారుడు వాళ్లింటికి డ్రైవర్‌గా, డ్రైవర్ రంగబాబు, శ్రీనివాస్‌గా వ్యవహరించను వస్తున్నారంటాడు. హైదరాబాద్‌కు జీపులో బయలుదేరే శ్రీనివాస్ తాను డ్రైవింగ్ చేస్తానని రంగబాబుకు చెప్పి దారిలో పలు యాక్సిడెంట్లు చేసి గ్రామస్తుల చేత దేహశుద్ధి చేయించుకొంటాడు. దీంతో తన అసలు అవతారంతోనే రాజారావు ఇంటికి వెళ్తాడు. కానీ అతను శ్రీనివాస్‌ను డ్రైవర్‌గా, రంగబాబును అల్లుడిగా ట్రీట్ చేస్తుంటాడు. శ్రీనివాస్ అసలు విషయం చెప్పినా నమ్మడు. ఈ దశలో మణిమాల, రంగబాబుల మధ్య ప్రేమ అంకురిస్తుంది. ఒక దశలో రంగబాబు తాను డ్రైవర్ అని చెప్పినా ఆమె పట్టించుకోదు. రాజారావు సోదరుడు నీలకంఠం(ఎంఎస్‌నారాయణ), తన న్యాయ సలహాదారుడు చిట్టిరాజు(కృష్ణభగవాన్)తో కూతురు ఉషనిచ్చి పెళ్లి చేయాలనుకొంటాడు. ఉష ఈ విషయం మణిమాలకు చెబుతుంది. ఆమె రంగంలోనికి రంగబాబును దింపుతుంది. పూర్వాశ్రమంలో శ్రీనివాస్, చిట్టిరాజు అమెరికాలో మిత్రులు. తనకు అడ్డంకిగా తయారైన రంగబాబును వదిలించుకోను జీవా దంపతులను హైదరాబాద్‌కు పిలిపిస్తాడు చిట్టిరాజు. పెద్దలు శ్రీనివాస్ - మణిమాల, చిట్టిరాజు - ఉషల పెళ్లి చేయను సిద్ధపడతారు. రంగబాబు తన బుర్రకు పనిచెప్పి పోలీసులను రంగంలో దింపి కాస్త అలజడి చేసి పెద్దల మనస్సు మార్చి తన ప్రేయసి మణిమాలను స్వంతం చేసుకోవడంతో చిత్రం ముగుస్తుంది.

కామెడీ తరహా పాత్రలు పోషించడంలో హీరో నరేష్‌ది అందెవేసిన చేయి. ఆయనతోపాటు అవసరాల శ్రీనివాస్ కూడా తన పాత్రను బాగా చేశాడు. కామెడీ గ్యాంగ్‌లోని జీవా, కృష్ణభగవాన్, జయలలిత, సన, ఎంఎస్‌నారాయణ తమ పాత్రల పోషణలో పోటీ పడ్డారు. రాజారావు పాత్రలో ఆహూతి ప్రసాద్ ఆహార్యం కొత్తగా అనిపిస్తుంది. సరదాగా రెండు గంటలపాటు గడపను ఈ చిత్రానికి కుటుంబ సమేతంగా నిర్భయంతరంగా వెళ్లొచ్చు.

# బాలభవన్‌లో సమస్యల పుట్ట!

పరీక్షలు, మార్కులంటూ నిత్యం పుస్తకాలతో కుస్తీపడుతూ వుండే పిల్లల్లో మానసిక ఒత్తిడిని తగ్గించి, వారిలో సృజనాత్మకతను పెంపొందించేందుకు ఏర్పాటైన బాలభవన్ సమస్యలతో కునారిల్లు




తడికల బజార్ సెంటర్‌లోని బాలభవన్.

తుంది. వివిధ కళల్లో చిన్నారులకు ప్రవేశం కల్పించేందుకు ప్రభుత్వం తడికలబజార్ సెంటర్‌లో దీనిని ఏర్పాటుచేసి జవహర్ బాలభవన్‌గా నామకరణం చేసింది. 1986 క్రితం వరకు బాల కేంద్రంగా వుండగా, 2004లో దీనిని బాలభవన్‌గా మార్చింది. ఈ భవన్‌లో ఐదు సంవత్సరాల నుంచి 15 సంవత్సరాల వయస్సు గల విద్యార్థినీ, విద్యార్థులకు వివిధ కళల్లో శిక్షణనిస్తారు. శాస్త్రీయ సంగీతం, వీణ, వయోలిన్, గాత్రంతోపాటు చిత్రలేఖనం, టైలరింగ్, అల్లికలు, వివిధ చేతివృత్తులలో శిక్షణనిస్తారు. ప్రతి సంవత్సరం 1000 మంది పిల్లలకు శిక్షణ ఇవ్వాలన్నది ప్రభుత్వ నిబంధన. ప్రభుత్వం సదుద్దేశంతో దీనిని ఏర్పాటు చేసినా నిధుల కొరత, మౌలిక సదుపాయాలు లేకపోవడం, అపరిశుభ్ర వాతావరణం నెలకొని వుండడం, భవనం దెబ్బతిని వుండడంతో సమస్యలకు ఆలవాలమైంది. మురికినీరు బాలభవన్ ఆవరణలో చేరుతుండడంతో దుర్గంధం వెదజల్లుతోంది. వర్షాకాలం వచ్చిందంటే నీరు నిలచి పోతుండడంతో పారిశుద్ధ్య సమస్యలు తలెత్తుతున్నాయి. పరిస్థితులు బాగోలేక పోవడంతో శిక్షణ నిచ్చేందుకు శిక్షకులు వున్నా ఏడాదికేడాది విద్యార్థుల సంఖ్య తగ్గి పోతున్నది. అధికారులు స్పందించి బాలభవన్ సమస్యలు పరిష్కరించి చిన్నారులకు చేరువ చేయాల్సి వుంది.

## రియల్ ఎస్టేట్‌గా మారుతున్న గులాబీ తోటలు

గులాబీ తోటలంటే టక్కున గుర్తుకొచ్చేది రూరల్ మండలంలోని నవలాకులతోట ప్రాంతం. వివిధ జాతులకు చెందిన రోజా పూల చెట్లు ఈ ప్రాంతంలో విస్తారంగా సాగుచేసేవారు. దాదాపు 100 ఎకరాలకు పైగా ఈ తోటలు సాగయ్యేవి. వీటితోపాటు మనోరంజని పూలచెట్లను పెంచేవారు. చుట్టుప్రక్కల ప్రాంతాల్లోని వ్యాపారులు గులాబీల కోసం నవలాకులతోట ప్రాంతానికి వచ్చేవారు. తాజాపూలు, మామూలు రోజాల నుంచి కాకినాడ జాతికి చెందిన పలురకాల రోజాల వరకు ఇక్కడ సాగుచేసేవారు. ఇదంతా గతం. రియల్ ఎస్టేట్ వ్యాపారం పుణ్యమా అని ఈ పూలతోటలు కాస్త కనుమరుగై పోతున్నాయి. భూముల ధరలకు రెక్కలు రావడం పూలతోటల పాలిట శాపంగా మారింది. రియల్‌ఎస్టేట్ వ్యాపారులు అధికధర పెట్టి భూములు కొనుగోలు చేస్తుండడం, రోజాపూల తోటల్లో లాభాలు తగ్గుతుండడంతో పలువురు రైతులు తమ భూములను రియల్ ఎస్టేట్ వ్యాపారులకు అమ్మివేశారు. దీంతో వంద ఎకరాలకు పైగా సాగులో వున్న రోజా పూలతోటలు కనుమరుగైపోయి ప్లాట్లుగా మారాయి.

### ఇక పేరుకే నవలాకులతోట

## అక్రమ రవాణాకు బ్రేక్

ఆర్టీసి ఆదాయానికి గండి కొడుతున్న కాంట్రాక్టు బస్సులు, ఆటోలను నివారించడానికి, వాటి బారి నుంచి బయటపడి లాభాలు సాధించేందుకు రవాణా సంస్థ నడుం బిగించింది. ఆర్టీసి జిల్లాస్థాయి సంఘం ఆధ్వర్యంలో ఇందుకోసం పలు తీర్మానాలు చేశారు. ఇటీవల ఎస్పీ దామోదర్, విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ ఎస్పీ మోహన్‌రావు, ప్రాంతీయ రవాణా అధికారి రాంప్రసాద్, స్థాయి సంఘం కన్వీనర్ శేషగిరిరావు సమావేశమై పలు నిర్ణయాలు తీసుకొన్నారు. ముఖ్యంగా రీజియన్ పరిధిలో తిరుగుతున్న 27 కాంట్రాక్ట్ బస్సులు బస్టాండ్ల పరిధిలో ఆపి ప్రయాణీకులను ఎక్కించుకొనే వీలు లేకుండా చర్యలు చేపట్టాలని తీర్మానించారు. సామర్థ్యానికి మించి ప్రయాణీకులను ఎక్కించుకొని తిరుగుతున్న ఆటో డ్రైవర్లపై కఠినచర్యలు తీసుకోనున్నారు. మొదటగా ఆత్మకూరు – నెల్లూరు, సోమశిల – ఆత్మకూరు, నెల్లూరు – ముత్తుకూరు, గూడూరు – కోట, నెల్లూరు – బుచ్చి రూట్లపై నిఘా పెట్టి అక్రమ రవాణాను నిరోధించనున్నారు. ఇందుకోసం ఆర్టీసికి సహకరించేందుకు పోలీస్ శాఖ నుంచి ఇన్స్‌పెక్టర్ స్థాయి అధికారిని తీసుకొన్నారు.

• ఉప్పొంగిన అభిమాన జనసందోహం నడుమ

# టి.సుబ్బరామిరెడ్డి జన్మదినోత్సవం!



పుట్టుకరీత్యా నెల్లూరీయుడైనా, విశాఖపట్నం వాసుల మానసపుత్రుడైన రాజ్యసభ సభ్యుడు డాక్టర్ తిక్కవరపు సుబ్బరామిరెడ్డి గారు తన జన్మదినోత్సవ వేడుకలను విశాఖపట్నంలో అభిమానులు, ఆత్మీయులు, ఆధ్యాత్మికవేత్తలు, సినీతారల ఆశీర్వచనాల నడుమ ఆత్మీయంగా చేసుకొన్నారు. సుబ్బరామిరెడ్డి గారు పుట్టిన రోజంటే విశాఖపట్నంలోని ప్రజల హృదయాలు వుప్పొంగుతాయి. ఎంత పనుల ఒత్తిడిలో వున్నా ఆత్మీయత కురిపించను తరలివస్తారు. గత 40 ఏళ్లుగా ఇదే రీతిన జరుగుతున్న ఈ పుట్టిన రోజు వేడుకలు ఈసారి వినాయకచవితి పండుగ వేడుకలను సైతం మరిపింపజేసాయంటే దీనిలో అతిశయోక్తి ఏమి కనిపించదు.

### జన్మధన్యమన్న టి.సుబ్బరామిరెడ్డి

ఇసుకేస్తే రాలనంత జనంతో నిండిన ఆడిటోరియంలో మాట్లాడను టి.సుబ్బరామిరెడ్డి గారు మైకు అందుకోగానే కరతాళ ధ్వనుల వర్షం మార్మోగింది. వుద్వేగంగా ఉపన్యాసాన్ని మొదలెట్టిన టిఎస్సార్ భగవంతుడు ప్రజలకు సేవచేసే అవకాశం కల్పించి భూమ్మీదికి పంపిన ఈరోజును వారి ముందే జరుపుకోవడం ఒక అదృష్టంగా భావిస్తున్నానన్నారు. సభికులారా కైలాసాన్ని మీకు చూపించమంటారా అంటూ "కటాజటాః సంభ్రమభ్ర... అంటూ రావణకృత శివస్తోత్రాన్ని సంగీతశృతిలో గంభీరంగా పలికి ఆశ్చర్యపరిచారు. సుబ్బరామిరెడ్డిలో దైవాంశ కూడా ఇమిడి వుందనే దానికి శివస్తోత్ర ఆలాపన సాక్షీభూతంగా నిలచింది. కేంద్ర మంత్రి శ్రీ విలాస్‌రావ్‌దేశ్‌ముఖ్ సభా ప్రారంభకులుగా పాల్గొని సుబ్బరామిరెడ్డిగారు విశాఖలో వారి మాతృమూర్తి జ్ఞాపకార్థం నిర్మిస్తున్న ధర్మశాలకు శంఖుస్థాపన చేశారు.

### దేవలోకమే క్రిందకు దిగిందా?

సహస్రావధాని డాక్టర్ మాడుగుల నాగఫణిశర్మ మాట్లాడుతూ సుబ్బరామిరెడ్డి జన్మదినోత్సవానికి దేవలోకమే క్రిందికి దిగినది... కళాభారతిగా ఒదిగినదని కవితాత్మకంగా చమత్కరించారు.

### స్వర్ణ కంకణధారణ

ఈ జన్మదిన వేడుకలోనే సంగీత కళానిధి నేదునూరి కృష్ణమూర్తికి సుబ్బరామిరెడ్డి గారు స్వర్ణకంకణధారణ చేశారు.

### లక్ష తులసి మొక్కల పంపిణీ యజ్ఞం

నటి ఊర్వశి శారద మాట్లాడుతూ రాబోయే కార్తీక మాసంలో 24గంటలు ఆక్సిజన్ అందించే తులసిమొక్కలు ఓ లక్షను సుబ్బరామిరెడ్డి గారు విశాఖపట్నంలో వుచితంగా పంచిపెట్టాలని నిర్ణయించడం శ్లాఘనీయమన్నారు.

### సాంస్కృతిక విద్యాలయం నెలకొల్పాలి!

టిఎస్సార్‌ను ఎంతగానో అభిమానించే సహజనటి జయసుధ మాట్లాడుతూ సాంస్కృతిక రాజధానియైన విశాఖపట్నంలో మన సంస్కృతి ప్రతిబించే విధంగా సాంస్కృతిక విద్యాలయాన్ని సుబ్బరామిరెడ్డి గారు ప్రారంభింపచేస్తే బాగుంటుందన్నారు.

### బహుబాషల్లో మాట్లాడిన వైజయంతిమాల!

అలనాటి మేటినటి వైజయంతి మాల తన ప్రసంగాన్ని ఎందరో మహానుభావులంటూ ప్రారంభించి తమిళం, హిందీ, ఇంగ్లీష్‌లో ఏ భాషలో మాట్లాడాలని సభికులను అడిగారు.

### ఆకట్టుకున్న వాసురావు సంగీత విభావరి

సభకు ముందు వీనుల విందైన గీతాలతో సాలూరు వాసురావు బృందం చేసిన కచ్చేరి ఆకట్టుకోగా పి.మోహన్‌గాంధీ వాఖ్యానం సభను రక్తి కట్టించింది.

### ముఖ్యమంత్రి శుభాకాంక్షలు

వాస్తవానికి సుబ్బరామిరెడ్డి గారు జన్మదినోత్సవ వేడుకలకు రాష్ట్ర ముఖ్యమంత్రి కొణిజేటి రోశయ్య హాజరు కావాల్సింది. పని ఒత్తిడి వల్ల హాజరుకాలేకపోయిన ముఖ్యమంత్రి సుబ్బరామిరెడ్డికి జన్మదిన శుభాకాంక్షలు తెలియజేస్తూ సందేశం పంపారు. దానిలో నాలుగు దశాబ్దాలుగా విశాఖపట్నం ప్రజలకు సుబ్బరామిరెడ్డి గారు చేస్తున్న సేవలు ప్రస్తుతించారు. అనాధలకు శరణాలయం, కెజీహెచ్‌లో రోగుల సహాయకుల విశ్రాంతి గృహాన్ని ఆయన నిర్మింపతలపెట్టడాన్ని అభినందించారు. సర్వధర్మ సమభావన సమ్మేళనం పేరిట మత గురువులను సన్మానించడం మామూలు విషయం కాదని టిఎస్సార్‌ను అభినందించారు.

16, 17 తేదీల్లో భారీ ఎత్తున జరిగిన ఈ వేడుకలలో అక్కినేని నాగేశ్వరరావు గారికి మిలీనియం అవార్డును, వైజయంతిమాల నేషనల్ ఇంటిగ్రేషన్ అవార్డును, ప్రముఖ క్రీడాకారుడు అజారుద్దీన్‌కు లైఫ్‌టైమ్ అచీవ్‌మెంట్ అవార్డును, సినీ నటి జయసుధకు కళాసరస్వతి అవార్డును తన చేతులమీదుగా సుబ్బిరామిరెడ్డి గారు ఇచ్చి సత్కరించారు. దాదాపాల్కే అవార్డు గ్రహీత డాక్టర్ డి.రామానాయుడు గారిని ప్రత్యేకంగా సత్కరించారు. ఈ వేడుకల్లో అక్కినేని నాగార్జున, అక్కినేని అమల, శ్రీమతి జమున గార్లు పాల్గొన్నారు. పేదలకు అన్నదానం, వస్త్రదానం జరిగింది.

–మారుతి

## కోర్టు తీర్పు

9వ పేజీ కొరవ

మూర్తి జె.ఇ.చంబియార్ ఈ వివాదాస్పద స్థలాన్ని స్వయంగా పరిశీలించి, హిందువులు పరమపవిత్రంగా భావించే స్థలంలో మసీదు నిర్మాణం చాలా దురదృష్టకరం, కానీ అది జరిగింది కొన్ని వందల సంవత్సరాల క్రితం కాబట్టి, ఇప్పుడు ఆ అన్యాయాన్ని సవరించడం జరగని పని అని ప్రకటించి కేసు కొట్టి వేశాడు. 1934 మత కలహాల సమయంలో కొందరు హిందు ఛాందసవాదులు, బాబ్రీ మసీదు ప్రహరీ గోడలను, ఒక గోపురాన్ని ధ్వంసం చేశారు. అయితే బ్రిటిష్ ప్రభుత్వం వెంటనే స్పందించి, వాటిని పునర్నిర్మించింది. ఏ కారణం వల్లనో తెలియదు కానీ, బాబ్రీ మసీదు ఆనుకొనివున్న స్థలాన్ని ముస్లిం స్మశానంగా మార్చుకోవడానికి 1936లో ఉత్తరప్రదేశ్ సున్ని వక్ఫ్ బోర్డు అనుమతించింది. అందుకోసం ఒక చట్టం కూడా చేశారు.

న్యాయస్థానాలు, బ్రిటిష్ ప్రభుత్వం, నవాబులు ఎన్ని ప్రయత్నాలు చేసినా ఈ స్థలంపై హిందువుల మమకారం మందగించలేదు. ఎప్పుడే అవకాశం దొరికినా దీనిపై తమ హక్కును లోకానికి చాటుతూనే వచ్చారు. దానితో బ్రిటిష్ ప్రభుత్వం ఇక్కడ శాశ్వతంగా పోలీసు బందోబస్తు ఏర్పాటు చేసింది. అయితే 1949 డిసెంబర్ 22తేది అర్ధరాత్రి, పోలీసులు ఆదమరచి వున్నప్పుడు కొందరు హిందువులు మసీదు ఆవరణంలోకి దౌర్జన్యంగా ప్రవేశించి, రాముడు, సీతమ్మల విగ్రహాలను ప్రతిష్టించారు. ఈ వార్త తెలియగానే, ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, ఆ విగ్రహాలను తొలగించవలసిందిగా అప్పటి ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి పండిట్ గోవింద వల్లభ పంత్‌ను ఆదేశించాడు. కానీ ఫైజాబాద్ కలెక్టర్ కెకె.నాయర్, ముఖ్యమంత్రి ఆదేశాలను ఉల్లంఘించి, విగ్రహాలు తొలగిస్తే హిందువులు తిరుగుబాటు చేస్తారని నివేదిక పంపారు.

ఆ వెంటనే, హిందు మహాసభ సభ్యుడు గోపాల్‌సింగ్ విషారధ్, దిగంబర్ ఆఖార అధినేత మహంత్ పరమహంస రామచంద్ర దాస్‌లు, బాబ్రీ మసీదు స్థలం రామజన్మభూమికి చెందింది కాబట్టి, ఇక్కడ ప్రార్థనలు జరుపుకొనే అవకాశం కల్పించాలని కోర్టులో కేసులు దాఖలు చేశారు. ఇప్పుడు అలహాబాద్ హైకోర్టు వెలువరించనున్న తీర్పు ఈ కేసులకు సంబంధించినదే కావడం గమనార్హం. అంటే, కేసు దాఖలు చేసిన అరవై ఏళ్ల తర్వాత తీర్పు వస్తున్నదన్నమాట. వీటికి అనుబంధంగా 1959లో నిర్మోహి ఆఖార సంస్థ ఈ స్థలాన్ని రామ జన్మ భూమిగా ప్రకటించాలని ఒక కేసు వేసింది. 1961లో సున్ని సెంట్రల్ వక్ఫ్ బోర్డు ప్రతినిధులు ఈ స్థలాన్ని తమకు స్వాధీనం చేయాలని మరొక కేసు వేశారు. మొత్తం నాలుగు కేసులను కలిపి, తీర్పు చెప్పబోతున్నది అలహాబాద్ హైకోర్టు.

పై ప్రశ్నలన్నిటికీ సమాధానాలు చెప్పవలసిన బాధ్యత అలహాబాద్ హైకోర్టు న్యాయమూర్తుల మీద వుంది. ఇందులోని ప్రతి అంశమూ సున్నితమైనది, సంక్లిష్టమైనది. కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం అన్న పరిస్థితి. తీర్పులో న్యాయమూర్తులు ఎటు మొగ్గినా, బాధిత వర్గం ఆందోళనకు దిగడం ఖాయం. దాన్ని మసీదు అంటే హిందువులు పెట్రేగిపోతారు, కాదు అది రామజన్మ భూమి అంటే ముస్లింలు వీధులలోకి వస్తారు.

అందువల్లనే ఈ తీర్పు పట్ల యావత్ దేశం అంత ఉత్కంఠతో ఎదురు చూస్తున్నది. గొడవలు నివారించడానికి తీర్పు వాయిదా వేయించడానికీ ప్రయత్నం జరిగింది. తీర్పు చెప్పవలసిన ముగ్గురు న్యాయమూర్తులలో ఒకరైన జస్టిస్ ధర్మవీర్ శర్మ కూడా అదే అభిప్రాయం వ్యక్తం చేశాడు. కానీ ఎప్పుడో ఒకప్పుడు తీర్పు చెప్పక తప్పదు కాబట్టి ఇప్పటికే 60ఏళ్లుగా నానుతూ వున్న ఈ కేసును వదిలించుకోవాలని తతిమా ఇద్దరు న్యాయ మూర్తులు నిర్ణయానికి వచ్చారు.

అయితే అయోధ్య సమస్యకు ఈ హైకోర్టు తీర్పు తుది పరిష్కారం కాదు. ఇందులో తమకు అన్యాయం జరిగిందని భావించిన వారు సుప్రీం కోర్టుకు వెళ్లవచ్చు. ఆ తీర్పు కూడా నచ్చకపోతే, ఫుల్ బెంచ్‌లో కురేటివ్ పిటిషన్ దాఖలు చేయవచ్చు. అదీ ఒక అంగీకారం తేలకపోతే రివిజన్ పిటిషన్ వేయవచ్చు. న్యాయపరంగా ఇన్ని వసతులు వున్నప్పుడు ఒక్క హైకోర్టు తీర్పు మీద యావత్ దేశం అంతగా కలవరం చెందడం అనవసరం. కానీ అయోధ్య విషయంలో పరిష్కారం కంటే, అపరిష్కారం మీదనే అటు హిందు, ఇటు ముస్లిం మత ఛాందసులు మక్కువ చూపుతుండడం వల్లనే ఈ దుస్థితి. బాబ్రీ మసీదు వివాదంలో హిందు, ముస్లిం మత విశ్వాసాల కంటే రాజకీయ ఆశలు, ఆకాంక్షలు అధికంగా మిళితమై వున్నాయి. కేవలం మత విశ్వాసమైతే, రక్తపాతం, హింస, అలజడి, ఆందోళన అవసరం లేదు. ఏ మతం కూడా ఒక ప్రార్థనా మందిరం కోసం తలలు నరుక్కోవాలని, గొంతులు కత్తిరించుకోవాలని ఉద్భోదించదు. ఇరు మతాల పెద్దలూ ఒకచోట కూర్చుని, సువిశాలమైన ప్రాంగణంలో ఒక మసీదు, ఒక రామాలయం నిర్మించు కొంటే పేచీ వుండదు. కానీ వారికి కావలసింది ప్రార్థనా మందిరాలు కాదు. వాటి పేరుతో ప్రజల మధ్య వైరుధ్యాలు.

విశ్వహిందు పరిషత్ కానీ, రామజన్మ భూమి న్యాస్ కానీ, బాబ్రీ మసీదు కార్యాచరణ కమిటీ కానీ ఈ సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకోవాలని చూడడం లేదు. ఈ నెపంతో ప్రజలను రెండుగా చీల్చి, నెత్తుటి ఏర్లు పారించాలని కుట్ర పన్నుతున్నాయి. చాలా దురదృష్టకరమైన పరిస్థితి అది.

1985 ఎన్నికలలో భారతీయ జనతా పార్టీకి రెండంటే రెండు లోక్‌సభ స్థానాలు దక్కాయి. ఆ పార్టీ నామ రూపాలు లేకుండా నశించి పోతుందన్న అభిప్రాయం కల్గింది. రాజకీయంగా ఆ పార్టీని పునరుజ్జీవింప చేయాలనే కుత్సితంతో రామ జన్మ భూమి వివాదాన్ని తెరపైకి తెచ్చింది. ఆ పిలుపును అందుకొన్న ఎల్‌కె.అద్వానీ రథయాత్ర పేరుతో దేశమంతా తిరిగి హిందు మతోన్మాదాన్ని రెచ్చ గొట్టాడు. దాని ఫలితమే 1992 డిసెంబర్ 6తేది బాబ్రీ మసీదు కూల్చి వేత. ఆనాటి ప్రధాని పివి.నరసింహారావు బిజెపి నేతల మాటలు నమ్మి మోసపోయాడు. ఆ చారిత్రాత్మక తప్పిదానికి దేశం చాలా పెద్ద పరిహారాన్ని చెల్లిస్తూ వున్నది. 1996, 98 ఎన్నికలలో వాజ్‌పాయి ప్రధాని కావడానికి ప్రాతిపదిక బాబ్రీ మసీదు కూల్చివేత మాత్రమే అన్నసంగతి మరచిపోకూడదు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

పెంచిన జస్టిస్ వాడా రాజగోపాల్‌రెడ్డి తల్లి వాడా జయలక్ష్మమ్మ(97) 15వ తేది మరణించారు. జయలక్ష్మమ్మ గత 70 ఏళ్లుగా 'జమీన్‌రైతు' పాఠకురాలు. ఆమె పెద్ద కుమారుడు వాడా వేణు గోపాలరెడ్డి ఈ ప్రాంతీయులందరికీ సుపరిచితులే. జయలక్ష్మమ్మకు ఇద్దరు కుమార్తెలు. మాతృవియోగంలో వున్న వీరి కుటుంబానికి మా సానుభూతి.

## 50కోట్ల భూ దురాక్రమణ

16వ పేజీ కొరవ

నెల్లూరు ఎమ్మార్వో గురించి ఎంత తక్కువ చెప్పుకొంటే అంత మంచిది. ఆనం వారి దగ్గర బంధువాయన. వారి ఇంట్లో గిన్నెలు కడగడానికి, చెప్పులు మోయడానికే సమయం చాలదాయనకు. నీతిమంతుడని చెప్పుకోవడం, ఎమ్మెల్యే ఆదేశించే అవినీతి పనులను తలకెత్తుకోవడం ఆయన తత్వం. నిబంధనల ప్రకారం, ఇటువంటి భూ దురాక్రమణలు అడ్డగించవలసిన బాధ్యత ఎమ్మార్వోది. కానీ ఎక్కడో పదారుపల్లెలో పది మంది నిరుపేదలు గుడిసెలు వేసుకుంటే, భూమి బ్రద్దలై పోతున్నట్లు భావించి, పోలీస్ బలగంతో వెళ్లి, నిలువునా కూల గొట్టిన దొరవారికి వేదాయపాళెంలో బడాబాబులు చేస్తున్న దుర్మార్గం మాత్రం కంటికి కనిపించడం లేదు. దాని జోలికి వెళ్తే ఎమ్మెల్యే బడితపూజ చేస్తాడేమోనని భయం.

నగరం నడిబొడ్డున, ఒక రాజకీయ వాది, ఇంత దుర్మార్గంగా ప్రజలకు చెందిన ఆస్తిని కబళిస్తుంటే ఇందరు అధికారులు ఏమీ చేయలేక పోవడం నిజంగా సిగ్గుచేటు. రాజకీయ వాదుల మోచేతి నీళ్లు త్రాగడంలోనే తమ జన్మధన్యమైనట్లు వ్యవహరిస్తున్న ఈ అధికారులకు తమ గురించి ప్రజలు ఏమనుకుంటున్నారో, ఎంతగా నోట్లో ఊస్తున్నారో అర్థమయ్యేట్లు చెప్పగల్గితే, ఈ పాపపు పనులకు కావలి కాయరు.

## పదవీ గండం

మొదటి పేజీ కొరవ

ఎమ్మార్ గ్రూప్ చేసిన భూ కుంభకోణం కూడా డిఎల్.రవీంద్రరెడ్డి బయటపెట్టిందే. దీని విలువ కూడా కొన్ని వేల కోట్ల రూపాయలు. ప్రభుత్వాన్ని, ప్రభుత్వ రంగ సంస్థ ఎపిఐఐసిని నిలువునా ముంచిన ఎమ్మార్ గ్రూప్ మీద కనీసపాటి చర్య తీసుకోవడానికి రోశయ్యకు చేతులాడడం లేదు. ఆఖరకు, ఇంత ఘోరానికి పాల్పడిన ఐఎఎస్ అధికారి బిపి.ఆచార్యను కూడా కదిలించలేక పోతున్నాడాయన.

సరస్వతి ఇండస్ట్రీస్ పేరిట వైఎస్.జగన్ గుంటూరు జిల్లాలో వేలాది ఎకరాల సున్నపురాయి గనులను అక్రమంగా స్వంతం చేసుకొన్న సంఘటన గల్లీ నుంచి ఢిల్లీ వరకు ప్రకంపనలు రేపింది. ఒక పథకం ప్రకారం రాష్ట్రంలోని ప్రకృతి సంపదను తమ కుటుంబపరం చేసుకోవడానికి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి తన అధికారాన్ని వాడిన తీరు చూసి అవినీతి చక్రవర్తులుగా పేరుపొందిన వారు కూడా ముక్కున వేలేసుకొంటున్నారు. కానీ ఈ వ్యవహారంలో ఏ నిర్ణయం తీసుకోవాలో రోశయ్యకు అర్థం కావడం లేదు.

విశాఖపట్నంలో 300 కోట్ల రూపాయల విలువైన భూములను ఒక ప్రైవేట్ సంస్థకు 30లక్షల రూపాయలకే కట్టబెట్టి వెళ్లాడు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి. ఆ కుంభకోణం ఇప్పుడు వెలుగులోకి వచ్చింది. కేంద్ర మంత్రిణి, ప్రస్తుతం విశాఖపట్నం లోక్‌సభ సభ్యురాలు దగ్గుబాటి పురంధరేశ్వరి దీనిపై విచారణ జరిపి, ఆ భూములను స్వాధీనం చేసుకోవాలని ముఖ్యమంత్రికి లేఖ వ్రాసింది. కానీ ఆయనలో మాత్రం కదలిక లేదు.

వీటన్నిటికీ తలమానికమైనది వైఎస్ బావ మరిది రవీంద్రనాథ్‌రెడ్డి ఎరువుల దగా. రాష్ట్రంలో లక్షలాది మంది రైతులు బస్తాడు ఎరువు కోసం రోజులు తరబడి కాళ్లరిగేలా తిరుగుతుంటే, ఆత్మహత్యలకు పాల్పడుతుంటే, విసిగిపోయి లాటీలకు దిగుతుంటే, రవీంద్రనాథ్‌రెడ్డి మాత్రం తన మిక్సింగ్ ప్లాంట్‌లకు వేలాది టన్నుల ఎరువులను తరలించుక పోగల్గుతున్నాడు. వ్యవసాయ శాఖ మొత్తం ఆయనకు వూడిగం చేస్తున్నది. ఆ ప్లాంట్‌లలో ఆయన తయారుచేసే ఎరువులు పరమ నాసిరకం అని, వాటిని వాడిన రైతులు తీవ్రంగా నష్టపోవడం ఖాయమని వ్యవసాయశాఖ అధికారులే నిర్ధారించినా, పట్టించుకొనేవారు లేరు. ఈ దారుణంపై రాష్ట్రం మొత్తం రగడ తలెత్తితే, స్థానిక పోలీసులు సాహసం చేసి, రవీంద్రనాథ్‌రెడ్డిపై కేసులు పెడితే, వాటిని కొనసాగించే దమ్ము కూడా లేకుండా పోతున్నది ముఖ్యమంత్రికి. మరొకప్రక్క వ్యవసాయ మంత్రి రఘువీరారెడ్డి, ఆ ఎరువుల దగాకోరులకు బహిరంగంగానే వత్తాసు పలుకుతున్నాడు.

జలయజ్ఞంలో, ఎస్ఇజడ్‌ల భూపందారంలో, గనుల కేటాయింపులో, పరిశ్రమలకు రాయితీలు ఇవ్వడంలో... అవీ ఇవీ అని ఏమిటి, రాష్ట్ర ప్రభుత్వ ప్రమేయం వున్న ప్రతి అంశంలోను, ఏ ఫైల్ తెరిచి చూసినా గుడ్లు గ్గిరున తిరిగే అవినీతి కుంభకోణాలు కన్పిస్తున్నాయి. ప్రతి దోపిడీకి మూలం వైఎస్ కుటుంబంతో అనుబంధితమై కన్పిస్తున్నది. కానీ వీటిలో ఏ ఒక్క దాని మీద కూడా చర్య తీసుకోవడానికి, తప్పును సరిదిద్దడానికి రోశయ్యకు గుండె ధైర్యం చాలడం లేదు. అందుకు కారణం – ఆయన ప్రభుత్వం మొత్తం వైఎస్ అనుచరుల అండతో నడుస్తూ వుండడం. రోశయ్య క్యాబినెట్‌లో రోశయ్య మనిషి అని చెప్పుకోదగిన మంత్రి ఒక్కడు కూడా లేడు. అందరూ వైఎస్ భక్తులే. ఈ కుంభకోణాలతో ప్రత్యక్షంగా కానీ పరోక్షంగా కానీ వారికి ప్రమేయం వుంది. వాటా వుంది. తమ శాఖలలో బయటపడుతున్న తప్పులను, దోపిడీలను రక్షించే బాధ్యత ఈ మంత్రులు తీసుకొంటున్నారు. దొంగల మీద ఈగ కూడా వాలకుండా రక్షణ కవచం ఏర్పరుస్తున్నారు. ఓబులాపురం ఇనుప ఖనిజం అక్రమ త్రవ్వకాలలో ఆ విషయం స్పష్టంగా కన్పిస్తున్నది. రవీంద్రనాథ్‌రెడ్డి ఎరువుల దగాలో కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నది. ఈ మంత్రులందరికీ రింగ్‌లీడర్ కెవిపి.రామచంద్రరావు కావడం గమనార్హం. వైఎస్ హయాంలో జరిగిన ప్రతి అవినీతి కార్యక్రమానికి సూత్రధారి ఆయనే. ఆయనకు తెలియకుండా ప్రభుత్వంలో అప్పుడు చీమ కూడా కదలలేదు. ఇప్పుడు దోమ కూడా ఎగరడం లేదు. రోశయ్య క్యాబినెట్ మంత్రులందరినీ తన గుప్పెటలో పెట్టుకొని వున్న కెవిపి.రామచంద్రరావు, ఈ అవినీతి కుంభకోణాల మీద కనీసపాటి చర్య కూడా తీసుకొనే అవకాశం లేకుండా రోశయ్యను కట్టడి చేస్తున్నాడు. దొంగల జోలికి వెళ్తే నీ పదవికి గండం అన్న తీరులో ముఖ్యమంత్రిని నియమిస్తున్నాడు. దానితో పాపం రోశయ్య చేష్టలుడిగి చూస్తూ వుండి పోవడం తప్ప చేయగల్గింది ఏదీ లేకుండా పోతున్నది.

## జనవాణి

2వ పేజీ కొరవ

ప్రకటించడంతోపాటు పాల్గొంటున్న వారికి, వైఎస్ విగ్రహాలు ఏర్పాటుచేస్తున్నవారికి ఇబ్బందులు కలుగ జేయడం గర్హనీయం. మంత్రి పదవులు తృణప్రాయమన్న పిల్లి సుభాష్‌చంద్రబోస్, బాలినేని శ్రీనివాస రెడ్డి, కొండా సురేఖను చూసైనా వీరు బుద్ధి తెచ్చుకోవాలి. లేకుంటే ప్రజలే వీరికి తగినబుద్ధి చెబుతారు.

బి.శాలి, కావలి

● వెంకటగిరి

# పోలేరమ్మ జాతరకు సర్వం సిద్ధం!



రాష్ట్రవ్యాప్తంగా జరిగే గ్రామశక్తి దేవతల జాతరల్లో జిల్లాలోని వెంకటగిరిలో జరిగే పోలేరమ్మ జాతరకు ఒక ప్రత్యేకత వుంది. ఈ జాతరకు రాష్ట్రవ్యాప్తంగా ఎక్కడెక్కడో స్థిరపడిన వెంకటగిరీయులతోపాటు నెల్లూరు, చిత్తూరు, కడప జిల్లాల నుంచి లక్షలాది మంది భక్తులు తరలివస్తారు. కుల, మతాలకు అతీతంగా గ్రామశక్తిని భక్తితో పూజించే ఈ జాతర 1774 సంవత్సరం నుంచి జరుగుతున్నట్లు ఆధారాలున్నాయి. ప్రతి సంవత్సరం వినాయక చవితి తర్వాత వచ్చే మూడవ బుధవారం ఈ జాతర జరుగుతుంది. తొలి బుధవారం మొదటి చాటింపు, రెండవ బుధవారం రెండవ చాటింపు, మూడవ బుధవారం పురప్రజలకు గ్రామశక్తి పోలేరమ్మ దర్శనం జరుగుతుంది.

### బలులు సర్వసాధారణమే!

పోలేరమ్మను ఆమె పుట్టిల్లుగా చెప్పే కుమ్మరి కులస్తుల ఇంట్లో బంకమట్టితో ప్రతి ఏడాది చేస్తారు. ఆమె పుట్టిల్లు నుంచి అత్తవారిల్లుగా భావించే జీనుగులవారి వీధిలో అమ్మవారిని తెచ్చి నిలుపుతారు. గాలిగంగులు వచ్చి అమ్మవారికి కళ్లు, దిష్టిచుక్క పెట్టాక ప్రత్యేక రథంపై బజారువీధిలోని పోలేరమ్మ గుడి వద్ద భక్తుల దర్శనార్థం వుంచుతారు.

పోలేరమ్మను జీనుగుల వారి వీధి నుంచి గుడి వద్దకు తీసుకొచ్చే సమయంలో వేల సంఖ్యలో పొట్టేళ్లు, మేకపోతులు, కోళ్లు బలిస్తారు. అమ్మవారిని కైవల్యానదిలో నిమజ్జనం చేసేందుకు తీసుకెళ్లే ముందు దున్నపోతును బలిస్తారు. ఈ దున్నపోతు రక్తాన్ని అన్నంలో కలిపి గ్రామ సరిహద్దుల్లో చల్లుతారు. ఈ అన్నాన్ని పొలి అంటారు. దీన్ని చల్లే వ్యక్తిని ప్రత్యేక గౌరవంతో గ్రామస్తులు చూస్తారు. ఈవిధంగా చల్లడం వల్ల గ్రామం సుభిక్షంగా వుంటుందని చెబుతారు. నిమజ్జనం చేసే సమయంలో అమ్మవారిని తిట్టడం వింతగా తోస్తుంది. 1919 నుంచి గ్రామశక్తి పోలేరమ్మ జాతరను వెంకటగిరి రాజవంశీకులు ఘనంగా జరిపిస్తున్నారు.

### శుభకార్యాలు జరుపరు

జాతర మొదటి చాటింపు రోజు నుండి పట్టణంలోని ఏ ఇంటిలోనూ శుభకార్యాలు జరుపరు. జాతర అయిపోయాకే శుభకార్యాలు చేయడం ప్రారంభిస్తారు. వెంకటగిరి పోలేరమ్మ దేవస్థానాన్ని దేవాదాయ ధర్మాదాయ శాఖ 1992లో స్వాధీనం చేసుకొంది. అప్పటి నుంచి వీరు జాతర జరుపుతున్నా రాజవంశస్తులు జాతర జరిపేటప్పుడు మాత్రమే పోలేరమ్మ ముఖం కళకళలాడేదని గ్రామస్తులు చెబుతుంటారు.

### జనగిరిగా వెంకటగిరి

పోలేరమ్మ జాతర ఈ నెల 29, 30 తేదీలలో జరుగుతుంది. ఈ రోజుల్లో వెంకటగిరి 'జనగిరి'గా మారిపోతుంది. దూరప్రాంతాల నుంచి వచ్చే వెంకటగిరీయులు, వారి బంధువులతో కిటకిటలాడిపో తుంది. మటన్, చికెన్ భోజనం, నాటుసారా, మద్యం అమ్మకాలు లక్షల్లో జరుగుతాయి.

### కోరికలు తీర్చే కల్పవల్లి!

వెంకటగిరి పోలేరమ్మకు చెయ్యెత్తి దండం పెట్టి మనసులో కోరిక కోరుకొంటే మరుసటి ఏడాది నెరవేరడం ఖాయం. దీనికిగాను ప్రతి ఫలం అమ్మవారికి చెల్లించేది ఒక కోడి తలనే. మతాలకు అతీతంగా వెంకటగిరీయులంతా పోలేరమ్మను కొలుస్తారు. అదే వెంకటగిరి జాతర ప్రత్యేకత.

● కావలిలో

# ఘనంగా బామా సప్తమ వార్షికోత్సవం!




బామా సప్తమ వార్షికోత్సవంలో వర్ధమాన గాయకుల గానాలాపన.



వేడుకలను ప్రారంభిస్తున్న గాయని ఎస్‌పి.శైలజ. ప్రక్కన కార్యక్రమ నిర్వాహకుడు ఎల్.సుధాకర్‌రెడ్డి, అనంత శ్రీరామ్, భువనచంద్ర తదితరులు.

బాలసుబ్రహ్మణ్యం ఆర్ట్స్ అండ్ మ్యూజిక్ అకాడమి (బామా) సప్తమ వార్షికోత్సవం కళాకారులు, కళారాధకుల నడుమ సెప్టెంబర్ 19తేది కావలి రామిరెడ్డి సుబ్బరామిరెడ్డి కళ్యాణ మండపంలో వేడుకగా జరిగింది. ఈ కళాప్రాంగణానికి అగ్రిగోల్డ్ వ్యవస్థాపకులు అవ్వా వేంకట అప్పారావు కళాప్రాంగణంగా నామకరణం చేశారు నిర్వాహకులు. పాడనా తెలుగు పాట -2010 పేరుతో జరిగిన సుస్వరార్చన నిజంగా దేవులపల్లి వ్రాసిన ఆ పాటలాగే హృద్యంగా, మధురంగా సాగింది.

బామా వ్యవస్థాపక కార్యదర్శి ఎల్.సుధాకర్‌రెడ్డి స్వాగతోపన్యాసమిస్తూ కళాకారులను ప్రోత్సహించేందుకు, ప్రతి భావంతులను వెలుగులోకి తెచ్చేందుకు విఖ్యాత గాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం పేరుతో సాంస్కృతిక సేవా సంస్థను నెలకొల్పినట్లు చెప్పారు. బాలసుబ్రహ్మణ్యం సోదరి, ప్రముఖగాయని ఎస్‌పి.శైలజ జ్యోతి ప్రజ్వలనతో ప్రారంభమైన ఈ కార్యక్రమంలో మొదటగా వేటూరి స్మృత్యర్థం ఆయన కలం నుంచి జాలువారిన పాటలను టెలివిజన్‌లో ప్రసారం అవుతున్న పాడుతాతీయగా కార్యక్రమంలో పాల్గొంటున్న యువ గాయనీగాయకులు పాడారు. ఈ సందర్భంగా ఎస్‌పి.శైలజ సైతం నీపాదం ఇలలోన నాట్యవేదం... అనే పాటను పాడి శ్రోతలను మంత్రముగ్ధులను చేయగా, మరో గాయని, బాలుసోదరి ఎస్‌పి.వసంత వేటూరి సుందరరామ్మూర్తికి జాతీయ పురస్కారాన్ని అందించిన మాతృదేవోభవ చిత్రంలోని వేణువై వచ్చాను భువనానికి... అనే పాటను అంతే హృద్యంగా పాడి విన్పించారు.

### బాలు'పాట'శాల

బాలు'పాట'శాల పేరుతో ఎస్‌పి.బాలు పాడిన పాటలను హైదరాబాద్‌కు చెందిన రామారావు సంకలనం చేసిన పుస్తకాన్ని ప్రముఖ సినీ పాటల రచయిత భువనచంద్ర ఆవిష్కరించారు. ఆల్తూరి ఆదినారాయణరెడ్డి సహకారంతో ప్రచురించిన ఈ పుస్తకాన్ని శైలజ అందుకొన్నారు. ఈ కార్యక్రమానికి విశిష్ట అతిథిగా విచ్చేసిన యువ సినీగేయ రచయిత అనంత శ్రీరామ్ ప్రసంగం ఆహూతులను అలరించింది. పండిత పామరులనే తేడాలేకుండా ప్రతి ఒక్కరిని చైతన్య పరిచేది సంగీతం అన్నారు. సినీ పాటల ప్రస్థానాన్ని, కాలానికనుగుణంగా వాటిలో కల్గుతున్న మార్పులను ఆయన ఉదహరించారు. వేటూరి పాట నిజంగానే వేదం అని వ్యాఖ్యానించిన శ్రీరామ్ కావలి ప్రజలకు కళుగోళశాంభవి మాత ఆశీస్సులు ఎల్లకాలం వుండాలని ఆకాంక్షించారు. బామా వ్యవస్థాపకులు జలదంకి ప్రభాకర్, వ్యవస్థాపక అధ్యక్షుడు డాక్టర్ రవికుమార్, కోశాధికారి వెంకట్రామయ్య, ప్రాసప్రవీణ అన్నదాత మణి, రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

# చిరుకు రోశయ్య అండ!



ప్రజారాజ్యం అధినేత చిరంజీవి జిల్లాల పర్యటన వెనుక ముఖ్యమంత్రి రోశయ్య ప్రోత్సాహం వుందని చెప్తున్నారు. వైఎస్.జగన్ ఓదార్పు యాత్ర ప్రభావాన్ని పలచన చేయడానికి చిరంజీవిని ఒక అస్త్రంగా వాడుతున్నాడు ముఖ్యమంత్రి. తన యాత్రకు ప్రజలు విశేషంగా వస్తున్నారు కాబట్టి, రాష్ట్రంలో ప్రజాకర్షణ కల్గిన నాయకుడిని నేనొక్కడినే అనే అభిప్రాయం కల్పించడానికి జగన్ శతధా ప్రయత్నిస్తున్నాడు. తన యాత్ర ఏర్పాట్ల కోసం డబ్బు విచ్చలవిడిగా వెదజల్లుతున్నాడు. నూటికి తొంభై గ్రామాలలో వైఎస్ విగ్రహాలు జగన్ శిబిరం నుంచే సరఫరా అవుతున్నాయి. వారాల తరబడి జగన్ అనుచర నాయకులు ఆయా జిల్లాలలో గ్రామగ్రామాన తిరిగి యాత్రకు ఏర్పాట్లు చేస్తున్నారు. సాక్షి టీవీ, దినపత్రికలలో ఓదార్పు యాత్ర గురించి వూదర గొడుతున్నారు. ఇన్ని ప్రయత్నాలు చేసి, జగన్ తన యాత్రను విజయవంతం చేసుకొంటుంటే, ఏ ప్రయత్నమూ లేకుండా చిరంజీవికి అంతేస్థాయిలో జనం వస్తున్నారని చూపించి, ఓదార్పు యాత్రలో ప్రత్యేకత ఏమీ లేదని నిరూపించడం రోశయ్య అభిమతం. విశాఖ పర్యటనకు వెళ్లే ముందు రోజు అర్ధరాత్రి చిరంజీవి ముఖ్యమంత్రి ఇంటికి వెళ్లి, గంటకు పైగా చర్చ జరిపారట. సాధారణంగా రోశయ్య రాత్రి తొమ్మిది దాటితే ఎవరినీ కలవరు. కానీ చిరంజీవిని మాత్రం రాత్రి 12గంటల తర్వాత పిలిపించారు. అప్పుడైతే మీడియా కెమెరాలు, పత్రికా విలేఖరులు అక్కడ వుండరన్నది ఉద్దేశం.

గతంలో వైఎస్.రాజశేఖర్‌రెడ్డి కూడా చిరంజీవిని వాడుకోవడానికి చూశాడు. ఒక దశలో చిరంజీవి స్వంత పార్టీ పెట్టకుండా, కాంగ్రెస్‌కు సహకారం అందించాలనే ప్రతిపాదన కూడా ముందు పెట్టాడు. అయితే అప్పట్లో చిరు ప్రతినిధులు తీర్చలేని గొంతెమ్మ కోరికలు కోరారట. చిరుకు, అల్లు అరవింద్‌కు రాజ్యసభ సభ్యత్వాలతో పాటు, 300 కోట్ల రూపాయల నగదు ఇవ్వాలని షరతు పెట్టారట. ఏ కారణం వల్లనో ఆ ప్రతిపాదన సఫలం కాలేదు. దానితో ఎన్నికల ముందుగా చిరంజీవి ప్రభావాన్ని తగ్గించడానికి వైఎస్ చేయని ప్రయత్నం లేదు. అన్నపూర్ణ స్టూడియో స్థలం వివాదాన్ని పరిష్కరించడంతో పాటు, పెద్ద మొత్తంలో డబ్బు చెల్లించి అక్కినేని నాగార్జునను రంగంలోకి దింపాడు. మహేష్‌బాబు కోసం విశ్వ ప్రయత్నం చేశాడు. అతడు రాకపోయే సరికి కృష్ణను తెరమీదకు తెచ్చి, మహేష్‌బాబు కాంగ్రెస్ మద్దతుదారు అనే అభిప్రాయం కల్పించాడు. చిరంజీవి సినీ గ్లామర్‌ను పలచన చేయడం దీన్ని ఉద్దేశం. ఇప్పుడు రోశయ్య కూడా అదే తీరులో జగన్ ప్రాభవాన్ని పలచన చేయడానికి చిరంజీవి సినీ గ్లామర్‌ను పాచికగా విసురుతున్నాడు.

# హైదరాబాద్ ప్రశాంతం!

అయోధ్య తీర్పు తర్వాత ఉత్పన్నమయ్యే విపరిణామాలు హైదరాబాద్ నగరంలో శాంతిని చెదరగొట్టలేవని పరిశీలకులు ఆశిస్తున్నారు. అందుకు ప్రధాన కారణం జంట నగరాలలో ఒక రాజకీయ పార్టీగా బిజెపి తన ఉనికిని కోల్పోవడం. ఒకప్పుడు హైదరాబాద్ అంటే మత కలహాలకు కేంద్ర బిందువుగా వుండేది. ఏ కారణం లేకుండా కూడా అసాంఘిక శక్తులు వీధులలో వీరవిహారం చేసేవి. బిజెపి, మజ్లిస్ పార్టీలు ఈ రౌడీ మూకకు ఆశ్రయం కల్పించేవి. కానీ ఇప్పుడా పరిస్థితి లేదు. జంట నగరాలలో బిజెపి చాలా బలహీనపడిపోయింది. నామ మాత్రంగా మారింది. అదే సమయంలో మజ్లిస్ పార్టీలో కూడా మౌలిక మార్పులు వచ్చాయి. అసదుద్దీన్ ఒవైసీ, జాతీయ స్థాయి రాజకీయాలలో కీలక పాత్ర పోషిస్తున్నారు. కాంగ్రెస్ అధినేత్రి సోనియా గాంధీకి చాలా దగ్గరగా మెలగుతున్నాడు. కాశ్మీర్ కల్లోలంలో సైతం ఆయన మధ్యవర్తిత్వం ఆహ్వానించింది కేంద్ర ప్రభుత్వం. జాతీయస్థాయిలో తన ప్రతిష్ఠ దెబ్బ తినే సంకుచిత చర్యలను అసదుద్దీన్ అనుమతించే పరిస్థితి లేదు. ఆయన తన పార్టీ నేతలు, కార్యకర్తలకు చాలా స్పష్టమైన ఆదేశాలిచ్చాడట. అయోధ్య విషయంలో హైకోర్టు తీర్పును శిరసావహించడం తన పార్టీ విధానమని తేల్చి చెప్పాడట. తీర్పు పట్ల నిరసనలు, ఘర్షణలు వద్దని కట్టడి చేశాడట.

జంట నగరాల మంత్రులు దానం నాగేందర్, ముకేష్ గౌడ్ కూడా శాంతి పరిరక్షణలో తమ వంతు ప్రయత్నం చేస్తున్నారు. సిటీలో పేరు మోసిన రౌడీషీటర్లు, అల్లరి చిల్లరి మూకల కదలికలను పోలీసులతో పాటు వీరిద్దరు కూడా తమ అనుచరుల ద్వారా నిశితంగా గమనిస్తున్నారు. ఎక్కడా ఎటువంటి అవాంఛనీయ ఘటన జరగకుండా జాగ్రత్తలు తీసుకొంటున్నారు.

# 50కోట్ల భూ దురాక్రమణ కానరాదా?

## ● సన్నపురెడ్డి పెంచలరెడ్డి భూ దందాను ఆపడంలో విఫలమైన జిల్లా అధికారులు

నెల్లూరు వేదాయపాళెంలోని బాలయోగీశ్వర ఆశ్రమం స్థలం దురాక్రమణ విషయంలో జిల్లా అధికారుల అలసత్వం చూస్తుంటే మనసుకు బాధ కల్గుతున్నది. వీరి మత్తు వదిలించే వారు ఎవరూ లేరా అన్న అసహనం పుడుతున్నది.

ఇప్పటి ధరలలో లెక్కిస్తే యాభై కోట్ల రూపాయల వరకు పైగా విలువ చేసే భూమి ఇది. ఐదెకరాల సువిశాల విస్తీర్ణం. ఎప్పుడో హెచ్‌కెబాబు డిఆర్‌ఓగా వున్నప్పుడు, రామానంద అనే సన్యాసికి, దేవాలయం కట్టుకోవడానికి, ఆశ్రమం నడుపుకోవడానికి ఈ స్థలం ఇచ్చారు. అయితే అప్పట్లోనే దానిపై అభ్యంతరాలు వచ్చాయి. కోర్టు కేసులు పడ్డాయి. దానితో ఆ సన్యాసి తన జీవితకాలంలో అక్కడ ఇటుకరాయి పెట్టి చిన్న కట్టడం కూడా కట్టలేక పోయాడు. ఒక మూల గుడిసె వంటి ఇంట్లో కాపురం వుండేవాడు. అక్కడే మరణించాడు. ఆయన గతించిన తర్వాత జిల్లా అధికారులు తలచుకొని వుంటే ఈ స్థలం ప్రభుత్వ స్వాధీనమైపోయి వుండేది. కానీ ఈ లోగా ఆ ప్రాంతం కార్పొరేటర్ సన్నపురెడ్డి పెంచలరెడ్డి కన్ను ఆ స్థలంపై పడింది. ఆయన ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డికి అనుంగు శిష్యుడు. ఇద్దరి మధ్య ఆర్థిక లావాదేవీలున్నాయి. దోచుకొన్న సొత్తు వాటాలు వేసుకొని పంచుకొంటూ వుంటారు. దానితో పెంచలరెడ్డి భూ ఆక్రమణలు, కాంట్రాక్ట్ పనుల దుర్మార్గాలను ఏ అధికారీ అడ్డుకోవడానికి సాహసించడు. దురదృష్టవశాత్తు



ట్రంకురోడ్డును ఆనుకొనివున్న ఆశ్రమ స్థలంలో కట్టిన షాపింగ్ కాంప్లెక్స్.

వేదాయపాళెం భూమి విషయంలోనూ ఆ ఆటవిక నీతి ఆచరణకు వస్తున్నది.

కోర్టు కేసులు వున్నాయి కాబట్టి, ఆ స్థలంలో ఎవరూ ప్రవేశించకూడదనేది రెవిన్యూ అధికారులు చెప్పే వాదన. కానీ అదే ఉత్తర్వు భూ ఆక్రమణదారులకు కూడా వర్తిస్తుందని ఈ అధికారులు మర్చిపోతు న్నారు. లేదా మర్చిపోయినట్లు నటిస్తున్నారు. వారి అలుసు చూసుకొని పెంచలరెడ్డి ఆ భూమిలో పాగా వేశాడు. మొదట అక్కడ తాను ఆశ్రమం తరపున అన్నదానం చేయడానికి తాత్కాలిక షెడ్ నిర్మిస్తున్నట్లు అధికారులకు చెప్పారు. కోర్టు ఆదేశాల ప్రకారం అది కూడా అభ్యంతరమే. కానీ ఆశ్రమం కోసం పెంచలరెడ్డి ఏదో సేవ చేస్తున్న భ్రమ కల్పించి అధికారులు కళ్లు మూసుకొన్నారు. అంతే గుడారంలో దూరిన ఒంటె మాదిరి మొత్తం భూమిని కబ్జా చేశాడాయన. తాత్కాలిక షెడ్లు, అన్నదాన సత్రం బదులు శాశ్వత ప్రాతిపదికన అంగడి కొట్లు కట్టి, బాడుగకు ఇచ్చాడు. వెనుక వైపు స్థలాన్ని ముక్కలు ముక్కలుగా విభజించి అమ్ముకొన్నాడు. వాటిలో ఇప్పుడు భారీ స్థాయిలో నిర్మాణాలు జరిగి పోతున్నాయి.



బాలయోగీశ్వరాశ్రమం ముందున్న వినాయకుడి దేవాలయం.

జిల్లా కలెక్టర్ రాంగోపాల్ గారిది సాదుతత్వం. నొప్పింపక, తానొవ్వక తప్పించుక తిరుగువాడు ధన్యుడు సుమతీ అనే పద్యం ఆయనకు కంటోపాటం. అదే ఆయా విధుల నిర్వహణకు సూత్రం కూడా. తన కళ్లముందు జరిగేదేదీ తాను చూడనట్లే పక్కకు తప్పుకొని పోవడం అలవాటాయనకు. కన్పడింది కదా అని పట్టిచూస్తే, రాజకీయ దగుల్బాజీలు పైనబడి రక్కుతారన్న భయం. ఒక్కొక్కసారి అధికార బంధీరాంధత్వం కంటే మించిన వరం మరొకటి వుండదు మరి.

జాయింట్ కలెక్టర్ గారిని చూస్తే కోతల ఆర్భాటం తప్ప కుప్పలో విత్తులు లేవన్న సామెత గుర్తుకు వస్తుంది. పసి వయస్సులో వున్న ఐఎఎస్ అధికారి ఆయన. సెక్రటేరియట్‌లో వున్నత స్థానంలో వున్న ఒక అధికారి మద్దతు వుంది. ఆ వయస్సులో అధికారులు ఎంతో ఉడుకు మిడుకుగా పని చేయాలి. గతంలో ఆ స్థానంలో పని చేసిన హెచ్‌కె బాబు, సతీష్‌చంద్ర, సాంబశిరావు, బ్రహ్మ, ఎస్‌వి ప్రసాద్ వంటి అధికారులు జాయింట్ కలెక్టర్ పదవిలోని మజా ఏమిటో జిల్లా ప్రజలకు రుచి చూపి వెళ్లారు. కానీ సౌరభ్‌గౌర్ గారికి మాటలలో తప్ప చేతలలో పస చూపడం అలవాటు లేదు. గూడూరు తాలూకా ఎస్‌ఇజడ్ భూముల వ్యవహారంలో తలమునకలై, తతిమా విషయాలు పట్టించుకోవడం మానివేశాడు. తానున్నానని చెప్పుకోవడానికి, లేచీ లేవలేని బడుగు జీవుల ఫైళ్ల మీద అరివీర భయంకరంగా వ్రాసి పారేస్తున్నాడు.

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.